శ్రీ

సంగీత

# చంద్రహాసనాటకము.

గ్రంథకర్త,

మోరంపూడి రామరాజు

ముక్కెనవారిపాలెం.

ప్రతికర్త.

శ్రీ ఓరుగంటి కృష్ణారెడ్డిగారు,

కొటికెలపూడి.

కౌముదీ ముద్రాక్షరశాల, నరసరావుపేట.

1941.

# ఇందువచ్చు పాత్రలు.

సూత్రధారుఁడు
జ్యోతిష్కులు.
దుష్టబుద్ధి (కుంతలుని మంత్రి)
పరిచారకులు.
బాలుఁడు.
తలవర్లు.
కుళిందుఁడు.
వేటకాండ్రు.
సేవకుఁడు.
అనంతశాస్త్రి.
చంద్రహాసుఁడు (కుళిందుని పెంపుడుకొడుకు)
కుంతల మహారాజు.
మదనుఁడు (దుష్టబుద్ధి కుమారుఁడు)
బ్రాహ్మణులు.
మహర్షి.
ప్రజలు.

స్త్రీలు.

నటి.
సుమతీదేవి (కుళిందునిభార్య)
విషయ (దుష్టబుద్ధి కుమార్తె)
విమలాంగి (చెలికత్తె)
చంపకమాలిని, కాళికాంబ.

# తొలిపలుకు.

భాషా ప్రపంచంబునందు పద్య గద్య కావ్యాదులని పలు తెలుంగుల వెలువడి కవితా వధూటికి శిరోరత్నంబులై విరాజిల్లు చున్నయవి. ఇట్టి కావ్యంబులు పండిత పామర లోకంబుల రంజింపజేయు. అట్టి గ్రంథంబుల రచించి, జగంబున కర్పించి లోకంబున విజ్ఞానంబును నెలకొల్పి మార్గదర్శియై శాశ్వతాఖండ సుప్రశస్తకీర్తి నార్జించి పుణ్యంబుఁగొనునది కవియేగదా? కవిలేనిదే లోకనటనావిలాసంబులు మూలబడు. ప్రకృతి సౌందర్య సిద్ధంబగు యివ్వసుంధర రాణించుటకు కవియేగదా కారణభూతుఁడు. కవి లేనిది లోకం బంధకారబంధురంబుగదా? ఈ కాలమునుబట్టి కవులు వ్యర్థులని కొందరజ్ఞానులూహించుచున్నారు. అకటా! యెంత శోచనీయము. కాలముతోబాటు బుద్ధులు మారినవి. బుద్ధులతోపాటు, మహానుభావుల దివ్యాఖండయుంతశ్శక్తు లంతరించినవి. కావుననే యుద్గ్రంథంబులన్నియు మూలబడి శోకించుచున్నయవి. నాకు గాలి సుదర్శనముగారిచే విద్యజెప్పించిన ధన్యులగు బ్రహ్మశ్రీ పోలూరి వెంకట్రామయ్య. పోలూరి లక్ష్మీకాంతారావుగార్ల యనుమతిన నాకున్న కించత్ జ్ఞాన సంపత్తితో నిట్టి చరిత్ర వ్రాసితిని. ఇందు లక్షణాది దోషంబులున్న క్షమియింప ప్రార్థితులు.

దర్శితాలూకా,<br>
జమ్మలమడక శివారు,<br>
మక్కెనవారి పాలెము,<br>
10—4—41.

బుధజనవిధేయుడు,<br>
మోరంపూడి రామరాజు.

---

# పండితాభిప్రాయములు.

ఉ॥ వ్రాసెను చంద్రహాసకృతి • వందలువేలు వచింపనేల నే
వాసినిగాంచినారొ? తొలి • వారు కృతుల్ గొనువారలట్టులే
భాసురమూర్తి రెడ్డికుల • భవ్యుడు దీనినిగాంచు నీకవిం
దా సరసంపుఠీవులిడి • తన్వునుగాత కృతార్థజన్ముఁడై ॥
కొప్పరపు సోదరకవులు శతావధానులు గారి ఆశీర్వాదము.

శా॥ శ్రీరమ్యంబగు పద్యగద్య తతిచే • సిల్లన్ రసస్ఫూర్తిగా
మోరంపూడ్వర రామరాజకవి స • మ్మోదంబుగా వ్రాసె స
ద్ధీరుల్ మెచ్చగఁ జంద్రహాస నరరా • డ్దృశ్య ప్రబంధంబు నా
తారార్కంబుగఁ బండితస్తుతుల వి • స్తారంబు శోభిల్లఁగన్ ॥

నరసరావుపేట,
7—4—41.

ఇట్లు,
మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ.

మిత్రమా !

మీచేరచింపబడిన శృంగార భక్తి రసప్రధానంబగు చంద్రహాసంబను దృశ్యప్రబంధంబు నాద్యంతంబు దిలకించితి. దుష్టబుద్ధి దురాలోచన, విషయపన్నుగడ, చంద్రహాసుని ధీరత్వము లోనగు ఘట్టంబు లతి మాధుర్యము. శైలిరసవంతమై, భావ్యభివృద్ధిని సూచించున్నయది. పరాత్పరుఁ డాయురా రోగ్యంబులొసంగి యింకను యిట్టిగ్రంథంబు లనేకంబులు రచించునట్లొనర్పుఁగాత.

గోకనకొండ,
4—2—41.

ఇట్లు,
బుధజన విధేయుఁడు,
కె. జోసప్పకవి.

సంగీత

# చంద్రహాసనాటకము.



శా॥ శ్రీమద్భాస్కరవంశమండనుఁడు ధా । త్రీనాథవంద్యుండు, ని
స్సీమాటోప విభాస భోగ్యుఁడును రా । జీవాయతాక్షుండు. సౌ
రాముండిచ్చు నజస్రమున్ సిరులు దీ । ర్ఘాయుష్య సౌభాగ్య మీ
భూమిన్ ధీరుఁడు కృష్ణరెడ్డికిని స । మ్మోదంబు సంధిల్లఁగన్.

## విఘ్నేశ్వర ప్రార్థన బేహాగ్ జుల్వ

1 శ్రీ గణేశ నినుదలఁచిన । యోగులు దొలగింతువని
వేగ మ్రొక్కుచున్నవాడరా ॥శ్రీ॥
2 కవీశ్వరులు మంతసమున । గ్రక్కున నిను గొనియాడిన
యవారితము కోర్కెలిచ్చి । యాదరింపవే హెచ్చి ॥శ్రీ॥
3 పనుల చెరుపులకు దొరవని । ప్రార్థించితిగద మదిని
కనకృతి జనులర్సమంద । గా జేయుము దయాసాంద్ర ॥శ్రీ॥
4 హరుని గిరిజలకు కొమరుడ । శరజన్ముని ప్రియయనుజుడ
పరమపురుష రామరాజ । పాలితముఖకరిరాజ ॥శ్రీ॥

## సరస్వతీ ప్రార్థన.

గీ॥ పూర్వ కవులకు యశమిచ్చు । భూరికృపను
సరసము లొల్కు మృదుపల్కు । లవిరళముగ
నాయొకరసనకుం జేర్చి । నవ్యకృతిని
పండితుల్గన రంజించు । బ్రహ్మరాణి॥

## ఆంజనేయ స్తవము.

కం॥ అంగదునికక్ఘార్మి యనుచర
రంగా మృదుమధురవచన • రచనంబిడి నీ
లాంగుని కృతిసై జేయుమ
సింగరకొండాంజనేయ • శ్రితజనగేయా॥

## ఆర్య నుతి.

గీ॥ కవితలక్షణమేమియు • గాంచలేదు
కావ్యములనెల్ల పఠియించు • ఘనుఁడగాను
గాన విద్యయు తాళాది • క్రమమునున్న
గాన, దొసఁగులద్రోఁచి న • న్గావుడయ్య॥

## కృతిపతి వంశానుక్రమణిక.

సీ॥ శ్రీమించు నెల్లూరు • జిల్లాలొ వర దర్శి
తాలూక యొక్కటి • దనరుచుండు
నట్టి తాలూకాలొ • నల కొఁటికెలపూడి
యమరావతికి సమ • మనఁగవచ్చు
నాపురంబందున • ననిశంబు నాలుగు
జాతులవారలు • సంతసముగ
కాపురంబుండఁగా, • ఘన యశులౌవారి
లో రెడ్డివారలు • రూఢినుండి

గీ॥ రట్టి శ్రీ రెడ్డి వంశాబ్ధి • యందుబుట్టి
పరఁగ ప్రఖ్యాతినింజాల • బడసినట్టి
ధర్మపరులయి భువియందు • దనరునట్టి
వారలుండిరి, వార లె • వ్వారలనిన॥

సీ॥ సత్యంబుదప్పక • చరియింతు రనయంబు
ఘనులెన్నగను యోరు • గంటివారు
తమ సదాచార ప • ద్ధతినివీడియు మెలఁ
గని గుణాఢ్యులు యోరు • గంటివారు
దాన ప్రవీణులై • దీనుల బ్రోవ గం
కణముదాల్చిన యోరు • గంటివారు
పఠియింప దేవుని • ప్రార్థనవీడరు
కడు భక్తితో నోరు • గంటివారు
గీ॥ అమితమౌ దైవభక్తియు • నార్యరక్తి
పేదలను బ్రోచు నాసక్తి • ప్రియమృదూక్తి
కార్య సఫలీకృతావక్త । ఘన నయోక్తి
గలిగి వర్తింపుచుండెడి • ఘనులువారు॥

సీ॥ వారిలో ధీరుండు • వైభవోపేతుండు
సూర్యనారపరెడ్డి • సుగుణఖనియు
అమ్మహామహునకు • నతిపరామమ్మయు
పతిపూజమరువని • పరమసాధ్వి

దంపతులిరువురు • సొంపుగ సతతంబు
శ్రీరాఘవునిపూజఁ • జేయగాను
జేయగా వారికి • చిత్తజాకారులు
పుత్త్రులు పుత్త్రికల్ • బుట్టిరెపుడు
గీ॥ నిశ్చలాత్ములునై భువి • నెగడుచుందు
రాద్యులెన్నెడి ఘాతద • యాపరులను
సర్వ మర్త్యులు బొగడెడి • సద్గుణులును
నై, మెలంగుచునుందు రం • దగ్రసుతుఁడు॥

సీ॥ భగవానురెడ్డియు • పరగ నర్సారెడ్డి
పర సురవారెడ్డి • సరసుఁడెయును
నట్టి కొండారెడ్డి • యనుజు కృష్ణారెడ్డి
వీరి తోఁబుట్టువుల్ • వెలసిరంటు
అంబమ్మ మంగమ్మ • యావెన్క పేరమ్మ
రమణమ్మ లక్ష్మిదే • వమ జనించ
హాద్దుగా కడగొట్టు • నష్ట కుమారిత
వేంకట లక్ష్మమ్మ • వినుతశీల
గీ॥ పుట్టినారలు రత్నముల్ • ప్రోవురీతి
తల్లిదండ్రుల కోరిక • తెల్లదీర
బంధుజాలంబు యానంద • మందగాను
వెలసిరింపుగ ధర జనుల్ • వినుతిఁజేయ॥

వ॥ తరువాత భగవానురెడ్డి పున్నమాంబను పెండ్లియాడి
యామెయందు.

ఉ॥ ఆరయ రామలక్ష్మణులె • యానన గల్గిరి లక్ష్మయాఖ్య, డిం
పారఁగచిన్నలక్ష్మయ య • పారగుణుల్ మహిమోన్నతుల్సదా
చారులు సత్ప్రవర్తనులు • సత్కుల బంధువితానమెల్ల వా
హ్వారెయనంగ నొప్పిరిల • వార యిర్వురు వంశశేఖరుల్॥

కం॥ పెదలక్ష్మయ శీతాంబను
సదయత బెండ్లాడనామె • సద్గర్భమునన్
ముదితగు వేంకటసుబ్బమ
పుదయించెను సకల మనుజ • లుత్సాహింపన్॥

వ॥ తదుపరి నరసారెడ్డిగారి శాంతశమదమాది గుణంబులెట్టిపనిన.

ఉ॥ శాంతమునందు రాముఁడని • శమ్మథనమ్మున యక్షరాజు, సు
స్వాంతమునందు గీష్పతి య • జాత్మజుఁడౌ హరిభక్తియందుశ్రీ
కాంత సుతుండు రూపమున • క్రన్నన దానమునందు కర్ణుఁడున్
కాంతిని చంద్రుడంచు సరి • గానిలనొప్పెను, నర్సరెడ్డియున్॥

వ॥ మరియు నీపుణ్యంతు మహాలక్ష్మమ్మను వరించియుండ

గీ॥ అక్కజంబైన రూపుఁడౌ • యక్కిరెడ్డి
సుగుణరాశియు శ్రీమతి • సుబ్బమాంబ

గలిఁగినారలు వారికి • ఘనముగాను
యెంచదరమౌనె వీరల • నంచితముగ॥

వ॥ అక్కిరెడ్డికి లక్ష్మమ్మయను సాధ్విని పరిణయముఁజేయ వార
లకు జయరామరెడ్డి, సూర్య నారపరెడ్డి యను నిరువురు కుమా
రులు గలుఁగ నంతట నరసారెడ్డి రెండవ వివాహమాడనెంచి
సుబ్బమ్మను వైవాహికమాడియుండె

కం॥ సుబ్బమ్మ సుగుణరాసియు
నిబ్బరముగ నర్థులందు • నిల్కడ జూచుఁ
దబ్బిబ్బు లెరుగదెప్పుడు
నబ్బా! యిటువంటికాంత • లవనింగలరే?॥

వ॥ వెండియు.

కం॥ గురవారెడ్డికి భార్యయు
సరవితో మహాలక్ష్మమనెడి • సఖి, వీరలకుఁ
బరసుతుఁడు సాంబరెడ్డియు
కరమరుదుగ పార్వతమ్మ • గఁగిరి క్రమతఁ

వ॥ సాంబరెడ్డి శేషమ్మను సతిగాఁగ్రహించి నామెయందు అప్పమ్మ
యను బాలికారత్నమును గాంచియుండ కొండారెడ్డి సుబ్బమ్మ
నుపరిణయమాడి సుఖులై యుండ నంతట కృష్ణారెడ్డిగారి విత
రణాది గుణంబు లెట్టివనిన,

సీ॥ ఆఁకలిఁగొన్నట్టి • యతిథులఁగాంచిన
యన్నంబుబెట్టించు • నాదరణుఁడు
వసన విహీనులౌ • వారలఁబొడగన్న
వస్త్రంబులిచ్చెడి • వరగుణుండు
నిలయముల్లేనట్టి • నిరుపేదలంగని
గృహములఁగట్టించు • కీర్తియుతుఁడు
విద్యార్థులెవరేని • విచ్చేయవారికి
విత్తంబునొసఁగెడి • వితరణుండు

గీ॥ రెడ్డి ఘనుఁడు పరోపకా • రియు సతంబు
సూర్యనారపరెడ్డికి • సుగుణకొమరుఁ
డై, విబుధజన సమ్మతుం • డైన క్రిష్ణ
రెడ్డి ధార్మికమెన్నగా • దొడ్డగాదె?॥

వ॥ మరియు నాయన సంపద్వైభవాతిశయంబులెట్టివనిన

గీ॥ అర్థమున వైలబిలుఁడు య • టంచు సత్య
మునకు నల హరిశ్చంద్ర స • ముడును ధర్మ
మందు ధర్మరాజు, విభవ • మందు నింద్రుఁ
డంచు నలరె క్రిష్ణారెడ్డి • యవనియందు॥

వ॥ ఈ సుజనుని భార్యారత్నమౌ మహాలక్ష్మమ్మ పతిభక్తి
యెట్టిదనిన.

సీ॥ భర్తచెప్పినమాట • పాటించినమ్మను
సద్మహాలక్ష్మమ్మ • సాధ్వియెపుడు
పతియె దైవంబని • భర్తనుపూజించు
సద్మహాలక్ష్మమ్మ • సాధ్వియెపుడు
కాంతుఁడు ప్రేమించు • కార్యముల్ మెచ్చును
సద్మహాలక్ష్మమ్మ • సాధ్వియెపుడు
యర్థురెందరొవచ్చి • యన్నమడిగిన నిడు
సద్మహాలక్ష్మమ్మ • సాధ్వియెపుడు

గీ॥ అట్టి మహాలక్ష్మమ సుతుల • కై భ్రమించి
భూతదయచేతసమునసే • ప్రొద్దునెగడి
దేవదేవునిమదిని ప్రా • ర్థించినంత
గలిఁగె నొక్కకుమారిత • కాంక్షదీర॥

గీ॥ ఈమె నామంబు రామమ్మ • నెంచ, తోడి
బాలికలతోడ బూటకా • ల్బలుకబోదు
పొరుగుటిండ్లకు బొమ్మన్న • నపుగబోదు
చిన్నతనమైన మర్యాద • లన్ననేర్చె
యీగొ గోలిన బాలిక • యిలనుగలదె?

వ॥ వీరిట్లు దినదినాభివృద్ధి నొందుచుండ, క్రిష్ణారెడ్డి యొక్క దిన
సంబున పుణ్య కథావలోకనముం జేసి మోక్షాయత్తచిత్తుఁడై
ప్రాణంబు లశాశ్వతములుగాన యిహపరంబులందు నొక్క

సత్కార్యమొనర్చిన బాగుండుననియెంచి సప్తసంతానములలో కృతి విశేషమని పెద్దలు నుడువుచుందురు. అట్టి కృతిఁజెప్పించిన శ్రేయంబనియెంచి వెంటనే

గీ॥ ఆదరంబుగ నను బిల్వ • నంపి రావు
రావు: కృతిగ మారును గ్రంథ • రాజమొండు
సరసముతొల్క పండిత • కవులుమెచ్చ
ముదముమీరఁగ వ్రాయు తాం • బూలమిదిగో?

వ॥ అని, తాంబూలాంబరాదులొసంగి, పరమ భక్తుండగు చంద్రహాస చరిత్రంబు రచియించి మా పురనివాసుండగు శ్రీరాముని కంకితంబుగా నిమ్మనుచు, సంతసించి యోరుగంటి కృష్ణారెడ్డి గారిని కృతికర్తనుజేసి నేను రచింపఁబూనిన చంద్రహాస నాటక కథాక్రమంబెట్టిదనిన.



శ్రీ

సంగీత

# చంద్రహాస నాటకము.

## నాంది.

ఉ॥ శ్రీరఘురామచంద్రుఁడు య • శేష జనావళి పోషకుండు, వి
స్తార యశోవిహారుఁడును • సర్వ నిలింపులనాయకుండు నిం
పారఁగ నోరుగంటి వర • వంశభవుండగు కృష్ణరెడ్డి నిఁ
వారక నేలుచుండెడు సు • పావనశీలుఁడు గాఁచు సభ్యులన్॥

(ప్రవేశము సూత్రధారుడు)

సూ॥ (సభవంకజూచి) ఆహా! యేమి నేఁజేసినపుణ్యము. ఇమ్మహా
సభను దర్శించుభాగ్యము గలిఁగినది (కొంచెమాగి)

గీ॥ సర్వ శాస్త్రార్థ దక్షులౌ • సభికులార
చంద్రహాస నరేంద్రుని • చారితంబు
నాడఁబూనితి తప్పుల • నవలఁద్రోఁచి
యాత్మకున్మోదమున్గూర్పు • డార్యులార॥

ఈ నాట్యంబును సంగీత నటనాభినయములతో నాడఁదలం
చితిని. కావున మీరు నా కనుజ్ఞనీయఁగోరితిని. అయినను మహా
కోవిదులైన మీముందు నేనాడ జంకుచుంటిని. యెట్లయినను ఆడక
తప్పదుగదా (యోచించి) అట్లయిన నాప్రేయసిని బిలిపించి కర్తవ్య
మూహించెదను.

**బేహాగ్ - యేకతాళం.**

1 నటి యిటురమ్మా । నా మనోరథమా
నటనకౌశలమ । నయగుణగణమా ॥న॥
2 సకల శాస్త్రములు । చదివినధీరులె
యకటనాటకం । బాడదలంచితి ॥న॥
3 ఇందుకు నై నే । సందేహించితి
పొందుగ నాడనే । ప్రోత్సహించుటకై ॥న॥
4 కరుణతో నోరూ । గంటి కృష్ణారెడ్డి
నరలేక నేలునా । హరినిదలంచుచు ॥న॥

(నటి ప్రవేశించి)

నటి॥ ప్రాణేశ్వరా యేమిసెలవు.
సూ॥ సఖీ! యిచ్చట నాటకమాడుదుమని సభికులందరు విచ్చేసిరి. ఈ నాటకమాడి జయము బొందుదునా లేదా యను సందేహముతో నిన్నిటకు రప్పించితిని. ఈ కార్యము నిర్వహించు మార్గమాలోచించి చెప్పుము.
నటి॥ నాథా! ఈ పండితోత్తము లనేక నాటకములు చూచినవారలు గాన, వీరిని రంజించుట కష్టసాధ్యమని తోఁచుచున్నది.
సూ॥ కష్టమేమియునులేదు వినుము.

గీ॥ సారమునుగ్రోలుచుండును । సద్గుణుండు
నంబువేర్జేసి పాల్ద్రావు । హంసపగిది

దోసఁగులను యెంచుచుండును • దుర్గుణుండు
కమలమధువును జోరీగ • గాంచనట్లు॥

రసికాగ్రేసరులు మెచ్చిన జాలును దుష్టులు దూషించిన మన కేమిలోటగును.

నటి॥ సరే, నాధా మనమిప్పుడు ప్రదర్శింపఁబోవు నాటకమేదియో సెలవిండు.

సూ॥ సంగీత చంద్రహాస.

నటి। దీనిని వ్రాసినవారెవరు.

సూ॥ మోరంపూడి రామరాట్కవి.

నటి॥ (ధైర్యమువహించి) నాధా! మన ప్రయత్నమునకు దేవుని యత్న మనుకూలమయ్యేనేని తప్పక వీరిని రంజించెదము. ధైర్యము విడువకుఁడు.

సూ॥ (హర్షించి) ప్రేయసీ! ఇంక కాలయాపనమేల యీ సభికుల కలకలారవములు చల్లారునట్లు వసంతఋతువునుగూర్చి శ్రావ్య గానముఁబాడుము.

నటి॥ మంచిది.

కమాచి - రూపకం.

1 ఆహా వసంతమెన్న । యానందముగా
వాహావా యీ చంద్రకిరణ । మూహింపగ సంతసంబు ॥ఆ॥
2 మలయమారుతము వీవా । మల్లెవిరులతావిలేవ
చిలుకల పికగానంబును । చెలఁగికేకి నృత్యంబును ॥ఆ॥

3 కిసలయముల సొంపూనిం। పెసఁగు సూనవాసితంబు
పొసఁగగాంచు జవ్వనులా। పూర్వపుణ్యమేమనందు ॥ఆ॥
4 ప్రేమమీర నోరుగంటి। క్రిష్ణరెడ్డి నేలెడి శ్రీ
రామచంద్రు మహిమచే వి। రాజిల్లెను చోద్యంబై ॥ఆ॥

సూ॥ ఆహా!

శా॥ కాంతా నీదగు గాన మాధురిమ జో • కంగాంచి యీ సభ్యుల
త్యంతా మోదముఁజెంది యుండుటయు వా • హ్వా! మోడు ప్రాకుల్ వెసన్
యెంతోవింతగమొల్కలెత్తె గనుగొం• పే హర్షముప్పొంగె నా
కింతీ నీవు కళత్రమౌట తొలి ని • న్నేజేయు పుణ్యంబునన్।

ఈ సభ్యులందరు త్వదీయ గాన రసామృతముఁగ్రోలి నిర్మల మనస్కులై యుండిరి కాన, యిప్పుడు జ్యోతిష పండితులను సభకు రప్పించి, వలయు పాత్రలను తయారుజేయుటకై లోని కరుగుదమురమ్ము.

సటి॥ చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)



శ్రీ

సంగీత

# చంద్రహాసనాటకము.

## ప్రథమరంగము.

(ఇరువురు జ్యోతిష్కులు ప్రవేశము.)

1 వ జ్యో॥ సోదరా. కుంతలమహారాజు మంత్రియైన దుష్టబుద్ధి గుణయుతుండనియు, దానపరుండనియు, రాజ్యవిషయములరాజున్నానో. లేడోయనునట్లతడే పరిపాలించుచున్నాఁడనియు, మనమిదివరకు వినియుంటిమి. కావున మనమిప్పుడాయన చెంతకరిగి శక్తికొలఁది సాముద్రికలక్షణముల కొన్నిటినిజెప్పిన సంతసించి మనయాసదీర పారితోషికము బహూకరించఁగలడు వెళ్లుదమా?

2 వ జ్యో॥ అన్నయ్యా. మీరుబల్కెడివాక్యములు నాకుచిత్రముగానున్నవి. యేలయన:

ఉం॥ అతఁడుసుధర్మవర్తి సచివాగ్రణిపుత్రకుఁడంచును బహూకృతులను గొంచువత్తుమనె దేటికి, అన్న! తదీయనామ మక్కౌతుకముడించె, దత్పితయె కొండొకనాటిగుణాలబట్టి, యయ్యతనికిదుష్టబుద్ధియను నాహ్వాయముంచె నటంచుదోచెడున్ కావునవిశాలమయి, నేత్రానందకరమైన, యుమ్మెత్తపువ్వు నేత్రరోగమును గల్గించుచు, పరిమళములేనిదై యెట్లు నిరసింపఁబడుచున్నదో, ఇతఁడును నట్టి శౌర్యాదికములుండినను గుణహీనుఁడగుటవలన మనకు దర్శనీయుడు కాడని నా యభిప్రాయము.

1 వ జ్యో॥ సోదరా. యేమి నీ వెర్రి. నామమునకును, యీవి నిచ్చు టకును సంబంధమేమి? పోవుదమురమ్ము.

2 వ జ్యో॥ సరే! తమమాట మీరనేల! పోవుదముపద.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

(ప్రవేశము - దుష్టబుద్ధి, జ్యోతిష్కులు, పరిచారకులు.)

దుష్ట॥ పరిచారకులారా! నాతో సమానమగు బుద్ధిశాలు రెందును లేరుగదా!

సీ॥ నా కౌశలముచేత • నానాదిశాధీశుఁ
లజయించి కప్పంబు • లఘువిఁగొంట
నా యభిజ్ఞతచేత • నరనాథులందరు
నాయాన దాటకుం • డను మెలఁగుట
నా నేర్పుచేతనే • మానవాధీశులు
సంజాయిషినొసంగ • జాలియుంట
నాచేతన బలము • నంగదా కుంతల
రాజేంద్రుఁడిట్టిగా • రవము నిడుట

గీ॥ నాదుతెలివినిబట్టి యే • మేదినీశు
మంత్రి నయ్యును నృపతుల • మదమడంచి
రాజ్యములనెల్ల గ్రహియించి • రాజువోలె
యేలుచుంటినిగద ధర • ణీశులెన్న?

పరి॥ అయ్యా మంత్రిసత్తమా! తమతో సమానమైన బుద్ధి బలం బులుగలవారెవ్వరును జగంబున లేరని యొక్కి వక్కాణింప వచ్చును.

దుష్ట॥ నిజము. మీరననేల ధరణినిగల మానవాళి నా బుద్ధిబలమును బట్టియే నన్ను గొనియాడుట.

1 వ జ్యో॥ (ఆశ్చర్యముతో) సచివరా : తమరిట్లు సెలవిచ్చెదరేమి ఎల్లకార్యములకు దైవబలమేకారణముగాని, మీతెలివిబలమేమి యక్కరకు వచ్చును. లేక మర్త్యులోకకార్యమునుజేయ నది యొకటియగును. అయ్యది దైవికముగాదా ?

దుష్ట॥ యేమీ! దైవము యెక్కడ యున్నాడు. మిమ్ములను ఆయన యేనా పోషించుట. (కొంచమాగి) యేల మీకీవెర్రి యేకార్య మైనను మదినాలోచించి చేతులారఁజేసిన వనకూడును కాని, దైవమే యిచ్చునని కూర్చున్నవానిపని యేమికాగలదు.

జ్యో॥ మంత్రిశేఖరా : మాపలుకులను పూర్వపక్షముఁజేయు చుంటి వా వినుము బుద్ధిబలాఢ్యుల సంగతి ఁజెప్పెదము. లక్కయింట బాండవుల ఁజంపనెంచిన దుర్యోధనుడు, ఆంజనేయుని తుదము ట్టింపనెంచిన కాలకేమి, బాలకృష్ణుని పరిమార్పనెంచిన కంసాది మహామహుల యూహలు దైవికమున నవియన్నియు దొలఁగి పోలేదా. కావున స్వబల మెందుకును పనికిరాదు. దైవబలమే ప్రాముఖ్యమని మాయుద్దేశ్యము.

దుష్ట॥ (పరిహాసముగా) యేమీ : దైవబలము ........ జ్ఞానహీను లైన మీకేమియు తెలియదు. వచ్చినదారినపొండు.

జంఝూటి - జుల్వ

1 చాలుజాలు మీతెలివికి। సంతసమయ్యేఁ
యేల బేలలయ్యేదరూ। యిఁక జనుదొయ్యేఁ ॥చా॥
2 చేతన బలమునను భూమి। నేతలువసుధా
యాతతగెల్చుచు నేలుచు। నలరగలేదా ॥చా
3 యిహపరంబు లందుటకూ। యిచ్ఛయే గాకా
నృహరి బలంబంట తెలివి। హీనమె జోకా ॥చా॥
4 యనయము కొటికెల పూడీ। కనక చేలుడూ
ఘనుడు కృష్ణారెడ్డి వేడ। కరుణ గావడూ ॥చా॥

జో॥ అయ్యాఅర్థులమైన మాయెడ తమకంతకోపమా! పెద్దల వాడుకసూక్తినిబట్టి, దైవబలమే యెక్కుడని చెప్పుచుంటిమి. గాని వేరుగాదు. అయినను తమకుజెప్ప మేమెంతటివారము.

(బాలుఁడు ప్రవేశము)

బా॥ ఆడుకొనుటకు నామిత్రు లెవ్వరును గాన రాకుండిరి గదా (అని చూచుచు దుష్టబుద్ధి సభకురాగా)

జో॥ (బాలునిగని) ఆహా! స్వామీ బాలకుని సౌష్ఠవము. ఈతడె వ్వడై యుండును. (మంత్రి నుద్దేశించి) యమాత్య చూడామణీ మనవాదన కేమిగాని యీతడెవడో వీనివృత్తాంతము నెలవీయ గోరెదము. మరియు,

మత్తకోకిల. వీనిమోమున క్షత్రియాంశము • వేట్కతోగన్పట్టుచుఁ
మానితంబుగ నుండెనోవర • మంత్రిసత్తమ దెల్పు నే

డీనినుంగను గన్నవారలు • నెవ్వరో పురమేదొ కో
పూనిపల్కు రతఁబు నిప్పుడు • పోతమూ చరితంబికఁ

డుష్ట॥ మునీంద్రులారా! వీఁడెటనుండియో మాగ్రామమునకు వచ్చి పురజనంబు లిచ్చుచున్న యన్నవస్త్రములచే జీవించుచు ప్రతి దినంబును మాబాలురతో నాటలాడు కొనుచుండును. ఇది నాకు దెలిసిన వృత్తాంతము.

జ్యో॥ అయ్యా! అట్లయిన మేమే వీనివృత్తాంతము సాంతముగా జెప్పెదము వినుము. (దివ్యదృష్టినిఁ జూచిగ్రహించి)

ధన్యాసి — ఏకతాళము

1 అయ్యో యెంతయవస్థ గల్గెన। త్యంత నీతిమంతుండు
చయ్యన కేరళ భూపాలునకును। చక్కని సుకుమారుండు
2 మానధనుండును గుణగరిష్ఠుఁడును। సూనసాయక నిభుండుఁ
మానుగనీతని జనన దోసమున, మడసిరి మాత పితండుఁ.

అంతట,

ఉ॥ పల్లిని దండ్రినిన్వదలి • తద్దయు (బాముల నొందుబాలునిఁ
యల్లన దాదిగాంచి విన • యంబున పోషణఁజేయుచుండ, కొ
న్నాళ్లకు వ్యాధపీడితము • నఁ మృతినొందెను దాసి,యంత నా
పల్లెనువీడి యీపురికి • వచ్చె సరక్షకుఁడౌటచే వెసఁ॥

ఇదిగాక, యీతడు మీరాజ్యమునకే రాజగునట్లు గూడా మాకు దోఁచు చున్నయది.

దుష్ట॥ (కోపముతో) యేమీ మీరుబొత్తుగా జ్ఞానశూన్యులని యిది వరకే ననియుంటిని గదా? ఇదివరలో దైవబలమను మాట యెంత నిజమో నిదియు నంతియే నిజము! లేకున్న నీ బాలకుఁడేమి యీ రాజ్యమునకు రాజగుటేమి? ఇఁక చాలును యిచ్చట నతిగా వాగక పొండు.

జ్యో॥ ఓరీ! దుర్మతీ! మమ్ము తృణప్రాయులుఁగా జూచెదవా! చూడుము నీకుకొలది కాలములోనే వినాశము గల్గుగాక. (అనిశపించి పోవుదురు.)

## రెండవ రంగము.

(దుష్టబుద్ధి సౌధము.)

దుష్ట॥ (మునుల పలుకుల దలఁచుకొని) అయ్యో! మునులకు నేదైన బహుమతి నివ్వక, యున్నతాసన మిచ్చి కూర్చుండజేయక, సగౌరవంబుగ మాట్లాడక, తిరస్కరించితిని. కోపముచే వారు నాకు వినాశము గలుఁగుగాక యని శపించిచనిరి. యేమి సేయుదును. (వ్యాకులచిత్తుఁడై)

చం॥ అరయఁగరాముబాణమును • యబ్జజువ్రాతయువిష్ణుచక్రము౯
పరఁగ నజాతశత్రు కృధ • పన్నగి కాటుకుమారు శస్త్రము౯
వరముని శాపంముప్రబల • పండిత వాక్యము రిత్తబోవటం
చురుతర కోవిదుల్ పలుకు • లూరకపోవునె యెంచిచూడఁగ౯.

కుంతలరాజు గతించిన వెనుక యాయన కొమార్తెయగు చంపకమాలను నాకుమారుఁడగు మదనున కిడి వైవాహికముఁజేసి

యీరాజ్యమునకు మదనునే పట్టాభిషిక్తునిఁజేయనెంచితివి. నావ్యూహాలన్నియు వ్యర్థములౌనట్లున్నవే? (బాలునుద్దేశించి) దుష్టుండగు బాలకుఁడీ పట్టణమున కేలరావలయును. ఇదియంతయు నాదురదృష్టము కొరకె (యోచించి) ఇంతకు నాదుఃఖమునకు కారణుఁడు బాలకుఁడు వీని నిప్పుడే చంపించిన నాదుఃఖము తొలఁగిపోవును. జాగుఁజేయక తలవరుల నిప్పుడే బిలచెదను. ఓరీ! తలవరీ, సురవా

సుర॥ (చెంతకువచ్చి) అయ్యాయ్య! దండాలు దొరో దండాలు

దుష్ట॥ (తొత్రుపాటుతో) తతిమ్మా తలవరులేరిరా!

సుర॥ అయ్యా! సరవడు, దిబ్బడు, సుబ్బడు యిప్పుడే యింఢ్లకు బోయారు.

దుష్ట॥ అటులైన నీవు త్వరగా వెళ్లి వారల దోడ్కొనిరమ్ము.

సుర॥ సిత్తం సిత్తం (అనిపోయి) అరెబావా సరవ నిన్ను యింకామనోల్లను మంత్రిగారు యేగంగా బిలుసుక రమ్మన్నారు పోదాంరారా.

సర॥ ఆసితత్రా నాకు పనుంది.

సుర॥ యేయి! ఆ యేసాలు బడపు.

నవరోజు - యేకతాళం

రారాపోదము సరవ। రాజుమంత్రి బిలుత్తుండు
తారుమారాడితేను। తన్నుతారు వదరకుండ ॥రా॥

సర॥ తాలరసె దూడజచ్చె। దాన్నిపుడు తేవాలె
మాలిగాడి తమ్ముడు చిన। మందణ్ని గొనిపోర ॥తా॥

గుర॥ ఆకూతగా త్తేను । అరిమెద మీద్దంతాను
నీకునాకు పగలొ త్తయి । యేలర యింతాజాగు ॥రా॥

సర॥ నాపెల్లం ము త్తితొ । నాకుసీవాట్లొ త్తాయి
కాపుగారింటి కిపుడు । కామకనే వోవాలె ॥తా॥

గుర॥ యీమాట మంతిరితొ । యిప్పుడె వొయిచెప్పుతాను
తామసించి నిన్ను శాన । తానుమారు జా త్తాడు ॥రా॥

సర॥ సారాయి కల్లునాకు । సాలినంత బోయి త్తె
దీరుడైన మంతిరీ । దేయిడికి వ త్తాను ॥తా॥

గుర॥ ప్రేమాతొ వోరుగంటి । కృష్ణారెడ్డి యనూ
కంపాగా చెడురాము । కరుణుండ కల్లుకేమి॥రా॥

సర॥ కాపుగారు యియ్యాల సీగటి మొకము తోటే వచ్చి నాపెల్లాంతో దూడచచ్చిందని సెప్పిండంట. అదినన్ను శానా యీరాది బారాది జాత్తుంది. నేనువోయి దాన్ని తేవాలెనే యట్టబ్బా! అట్టాదానిమాట యినకపోతే మల్లసిప్పలో కూడన్నా యెయ్యదే. అదే సందేయం.

గుర॥ అశ నీపల్లాంతో నే సెపుతారా (అని అందరిని బిలువ గుమిగూడి వచ్చుచుందురు)

దిబ్బ॥ గురన్నా మంతిరిగారు యెందుకురా మాకాడికి నిన్నంపింది.

గుర॥ మంతిరికి మంతో యేదోపని బడ్డట్టుంది. అదే నిజమాయెనా మన రొట్టిరిగి నేయిలో బడ్డట్టే. తగినంత బవుమతి సాలినంతకల్లు.

దిబ్బడు॥ అరె గురన్నా యిదేంటిగాని మొన్న సుమంతమారాజు గారు నన్నొకపనిమీదంపివచ్చినానిక యేంకల్లుబోయించిండురా మారాజు అబ్బా అబ్బ.

కీర్తన. (బుంగంటె బుంగగాదురా మాదిరి)

1 కల్లంటె కల్లుగాదురా । గురవన్న షల్లాసారాకల్లురా
కల్లా తియ్యానికల్లు । కంపూగుండేటికల్లు
యల్లారు బొగడుకల్లు । సల్లాదనమైనకల్లు ॥క॥
2 నిసాగుండేటికల్లు । నిప్పులు గక్కించుకల్లు
పసాన జనులమీఁద । పరుగునదూకించుకల్లు ॥క॥
3 సోకూదెప్పించుకల్లు । సొంపుగనాడించుకల్లు
బీకరింపజేయుకల్లు । బేసైన తెల్లకల్లు ॥క॥
4 వీకాతొ నలరించి । వేక్రిష్ణరెడ్డినేలు
నా కనకచేలూదయ । నేకరువుదీరదాగితి ॥క॥

గుర॥ అంతకాడికెక్కువగా మీ తపిందీర బోయిత్తా బేగిరాండహా (అన అందరు సంతోషపడి మంత్రివద్దకు వత్తురు.)

దుష్ట॥ (తనలో) యేమిది తలవరు లింతవరకును రాకుండిరి (యింతలో)

తలవరులు॥ దండాలు దొరో దండాలు (మ్రొక్కుదురు.)

దుష్ట॥ మంచిది! ఇటురండు మీకొక్క రహస్యమునుఁజెప్పెదను.

చం॥ తలవరులార బాలకుని • తక్షణమేగొనిపోయి కానకుఁ
యిల శిశువంచు జాలిఁగొన • కించుక చంపియు నానవాలుగా

బలయుతమొప్ప నేదయిన • బట్టుకవచ్చిన మీకు గొప్పగా
వెలగల భూషణాలిడెద • వేడుకపొందు జవంబుమీరఁగ ॥

ఈ రహస్యమును యెవరికిని తెలియకుండ అతి జాగరూకతతో చంపిరండు. పొండు.

తల॥ సిత్త్రం సిత్త్రం (అని బాలునిబట్టి రెక్కలుగట్టి అడవికి గొని పోవుదురు.)

అరణ్యము.

(తలవరులు, బాలుఁడు ప్రవేశము.)

బాలుడు॥ అయ్యా తలవరులారా! యేమియునెరుంగని పసివానిని నన్నిట్లు రెక్కలు విరుగదీసికట్టి బాధించెదరేమి, నన్ను విడచి పుణ్యముగట్టుకొనుఁడు.

పీలు - అటతాళం.

1 దిక్కుమాలిన నతీ । దీనుండనయ్యా
యక్కాటికమున న । న్నాదారింపుడయ్యా ॥ది॥
2 మ్రొక్కెదనయ్య నా । మొరవీనుడయ్యా
చిక్కితిమీకు ర । క్షించీ బ్రోవుడయ్య ॥ది॥
3 తల్లిదండ్రిలేని పే । దనునన్ను జంపంగ
యిలమీకు లాభంబూ । యేమీగలదయ్య ॥ది॥
4 ధరణిలో వోరుగంటి । వరకిృష్ణారెడ్డి
కిరువౌ కొటికెలపూడి । హరియౌరామునియాన ॥ది॥

అయ్యా కరుణించి విడువుడు.

తల॥ ఛీ. వాగకుండా వూరుకో, నిన్ను యిడిపించాలగా యిదుగో నరికెదము (కత్తిజూపి)

భూపాల - తిశ్ర.

1 సీసీ దుర్మార్గా నిను । నెందెదాముసూడరా
ఆసమ నిన్నింకా మం । త్రాగ్గె సంపియేసెదాము ॥సీ॥

2 బాలకుడననుచూ నీ । వగలుమాను మేము
బేలల మనుకొంటివసీ । సాలు వ్వదరకుండుకూర ॥సీ॥

ఓరీ రాజద్రోహీ బాలుఁడవైనా నీ నక్కయినయములేమిరా నీ టక్కుటమారిద్దెలు గట్టిపెట్టుము మా దగ్గెరనా నీబడాయి యిదుగో కత్తి నీదేయం ముక్కలుముక్కలు జాత్రాము (అని కొట్టుదురు.)

బాలుడు॥ (యేడ్చుచు) హా! పరమేశ్వరా! చిన్నతనము మొదలు యెట్టివారికైనను కీడుజేసి యెఱుంగనే నీ బిడ్డనైన నన్నిట్లు బాధింపఁజేయుట నీకు న్యాయమా (భటులతో) అయ్యలారా! యేల నన్నిట్లు బాధించెదరు.

ఉ॥ అయ్యయొ నాదుమిత్రులకు • నైనను యెగ్గును జేయలేదు నెం
దయ్యలు పట్టెడోరెము ద • యార్ద్రితబెట్టగ బట్టువాడ నా
కెయ్యెడ దిక్కులేరు మిము • నింతగ ప్రార్ధనజేయుచుంటి నే
నియ్యెడ మీదు బిడ్డనని • యే నను వీడుడి మీకుమ్రొక్కెదన్॥

(అని పెద్దగా యేడ్చును.)

తల॥ (ఒకడు కనిగాంబున) అరే పాపమీ బాలుఁడు యక్కైక్కేడు త్తుండర్రా (యోచించి) నేనొక్క వుపాయంజెపుతా వినండ్రా.

గీ॥ బాలునింజంప మనకు పా • పంబుగల్గు
కాలి పాదంపు నారవ • వ్రేలుగోసి
మంత్రికదిజూప హర్షించి • మనకు గొప్ప
కట్నమిచ్చు నితడు బ్రతు • కంగగలఁడు.

(యిట్లు జప్ప తలిమ్మా తలవర్లు సంతసించి)

బేస్ ఆ పని బాగుంద్దిరా (అని బాలుని పడవైచి వేళ్లు గోసికొనిపోవుదురు.)

బాలుడు॥ (దుఃఖముతో) ఆ జగద్రక్షకా ఈ కోతబాధకు నోర్వ లేకున్నాను తండ్రీ రక్షింపుము రక్షింపుము.

బేహాగ్ - ఏకతాళం.

1 శీతా ప్రాణలోలాయా । శ్రితజనావనా శీలా
నాతరమే నీమహిమబొగడుటకు । నళినదళాక్షా రక్షశిక్షా ॥శీ॥
2 తండ్రియాజ్ఞ గీర్చుటకూ వే । తల్లియు నరణ్యములకా
మందితులౌయాతాపసాశికిని।మన్ననతోడుతవరముకొసంగిన।శీ॥
3 తప్పులెంచకో స్వామీ నా । యప్పా నమ్మితినిసుమీ
వప్పుగనీకృపకొరకై నామన । సొప్పానుతించితితప్పదునీకిక।శీ।
4 నీకు దప్పనన్యులనూ మది । నెన్ని దలపగాబోను
సాకల్యంబుగ కృష్ణారెడ్డిని । సదయతొ నేలెడి పరమపావనా॥శీ।

అయ్యో యేమిసేయుదును. బాధ అంతకంత కెక్కువౌ చుండెనుగాని సుంతైనను తగ్గదాయె హా! తండ్రీ ప్రాణములు బోకున్నవి. కంఠము నఱికికొని ప్రాణముల బాయుదమన్న ఖడ్గమైనను లేదాయె. యురిదీసికొందమన్న రజ్జువైనను దొరకదాయె దూకి మృతినొందుదమన్న ఈ సమీపమున కూపమైనను గానరాదయ్యె. యీ బాధ కింకెట్లు తాళుదును. (యోచించి) ఓ పరమేశ్వరా ఈ నట్టడవిలోఁబడియున్న నన్ను పులులకైనను జూపించరాదా. ఆహా! యెంత యేడ్చినను నా బాధమాన్పుట కొక్కరైనను రాకుండిరిగదా! హా పరంధామా! నీలముంచినను పాలముంచినను నీదే భారము.

హిం॥ తోడి - తిశ్ర.

1 హా పరాత్పరా నన్నూ । ఆదరించి బ్రోవవేర
యో పన్నగశాయీ నే । నోర్వలేర యీ బాధకు ॥హా॥
2 యేపాపామెరుగనినన్ । నీయడవికిగొనివచ్చియు
నా పాపపుభటులూ న । న్నల్లాడగజేసిరిట్లు ॥హా॥
3 ఘనమగు కొటికెలపూడి । కనకచేల యెంతనినిన్
మనమున ధ్యానముజేతును । మనగజాల జాగుసేయ ॥హా॥

హా! రామచంద్రా యెంతవేడినను నీకు దయరాదాయెగదా (పరికించి) ఓ సూర్యచంద్రులారా మీకైనను దయరాదా.

సీ॥ నాబాధ మాన్పియు • ననుఁగావగారారె
సదయతతో సూర్య • చంద్రులార

నా యాపదందోోచి • నన్నుగాపాడరే
మోదంబుతో దృష్టి • మూర్తులార
నా దైన్యమును బాపి • నన్నాదరింపరే
వేలుపులార దీ • క్పాలులార
నా దుఃఖముఁ మాన్పి • నన్నుఁ పాలింపరే
పరమాత్మలో వాన • ప్రస్థులార
గీ॥ తరువులార కేసరులార • యురగులార
యక్షులార యీ వనచర • పక్షులార
చగములార మిన్నంటెడి • నగములార
శీఘ్రమే బోోవరే నాదు • చింతదీర్చి॥
(పడి యేడ్చుచుండును.)

మూడవరంగము.
(వేటాడుచు కుళిందుఁడు వేటకాండ్రు ప్రవేశము.)

కుళిం॥ భటులారా యేమీ యీమృగముల గుంపులు అదిగో శర
భము ఇదిగో శార్దూలము. అల్లవిగో కిటి కేసరాది జంతు సంతా
నములు తక్షణము వాటిని గూల్చుడు.
వేట॥ చిత్తం చిత్తం (అని పడగూల్తురు)

బ్యాండు స్వరం - జుల్వా.

కుళిం॥ శేవకులారా అదో। చిరుతగండు పరుగిడెను
చావనేయుడీమీరలు। సత్వరమున దాని నిపుడు

వేట॥ అదేగాక దొరో యీ। యడవి మెకములా
మీదయైన పడగూల్తుము। మేదినిపైనీ ॥అ॥

కుళిం॥ (వేటాడి అలసి) అబ్బా భటులారా యీ రోజున కింక వేట చాలింతము కాలాతీతమైనది ఆహా! యీ వృక్షముక్రింద యెంత చల్లగానున్నదో చూడుడు. (అందరు కూర్చుందురు)

బాలుఁడు॥ హా పరమేశ్వరా! యీబాధకు తాళలేను రక్షింపుము రక్షింపుము (ధ్వనిగలుగును.)

కుళిం॥ (ఆలించి) భటులారా యీ ప్రక్కనేదియో యార్తధ్వని వినవచ్చుచున్నది పోయి చూచివత్తమురండు (అందరువెళ్లుదురు)

వేట॥ అయ్యో యెవరో బాలుఁడు పడియున్నాడు.

కుళిం॥ (చెంతకరిగిచూచి) ఆహా! యేమి యీ బాలకుని కళా సంపదలు.

గీ॥ వాహ్వా యీ సుకుమారుఁ డె • వ్వనికుమారుఁ
డకట వాపోవుచును యొంటి • నడవినుంట
కేమి కతమొ సుతులు లేరు • స్వామియొసఁగె
వీనిఁ గొనిపోయి పెంచెద • ప్రేమమీర॥ [యోదార్చి]

అబ్బాయీ నీ వెవ్వఁడవు నీ జననీ జనకులెవ్వరు యిట్లు పడియుండుటకు కారణమేమి.

బాలుఁడు॥ (యేడ్చుచు) అయ్యో నేను కేరళమహారాజు కుమారుఁడనని జ్యోతిష్కులు దుష్టబుద్ధితోఁజెప్పగా వింటిని. ఇప్పుడు దుష్టబుద్ధి తలవరులు నన్నన్యాయముగా నడవికిఁగొనివచ్చి కాలి

వ్రేలిఁగోసి పడవైచి చనిరి. ఆ దురాత్ములుజేసిన చేతకు తల్లడిల్లుచుంటిని.

కుళిం॥ (సంతోషముతో) భటులారా ఇతఁడు నిశ్చయముగా క్షత్రియకుమారుఁడేనని వీని ముఖవికాసమే జెప్పుచున్నది. నేను వీనివి పెంచుకున్న బాగుండునని తోఁచుచున్నది.

వేట॥ మహాప్రభూ! ఇంతకన్నా జేసేవసేమున్నది. సరె మంచిదేః

కుళిం। బాలకా, నీవీయడవిని దుఃఖించుచున్న విన్నోదార్చు వారెవ్వరు. నేను పెంచుకొనెదను రమ్మ మా గృహంబునకు బోవుదము (అని గుఱ్ఱముపై నెక్కించుకొని పోవును.)

కుళిందుని సౌధము.

(కుళిందుఁడు సుమతీదేవి ఆసీనులై ప్రవేశింతురు.)

కుళిం॥ సతీమణీ, నేనొక కుమారుని దెచ్చితిని చూడుము.

సుమ॥ నాధా మంచిది, అపుత్త్రస్య గతిర్నాస్తి యను శృతికి దూరులమైతిమి, యిఁక మనకు కొఱంతయేమి.

కుళిం॥ కుమారునకు నామకరణ మేదైన బాగుండునో పండితులఁ బిలపించి కనుగొందము. ఓరీ శేవకా!

శేవ॥ అయ్యా అయ్య.

కుళిం। నీవీ తక్షణంబరిగి మన పురమునగల అనంతశాస్త్రిగారిని నాయాజ్ఞగా దోడ్కొనిరమ్ము.

శేవ॥ చిత్తము. (అనిపోయి అనంతశాస్త్రితో ప్రవేశించును.)

అనం॥ రాజా! యేమియాజ్ఞ.

కుళిం॥ శాస్త్రిగారూ నేనొక కుమారుని దెచ్చితిని. వీనికి మంచి నామకరణమును నిర్ణయింపుడు. (అని బాలునిజూప)

అనం॥ (హర్షించి) రాజా! వీనికి వేరే నామమును యోచింప నేల

గీ॥ నగుమొగము చంద్రునింగేరు • నయ్య! గాన
వీనికిఁ జంద్రహాసుఁడను • పేరుతగును
యిది మొదలు నిట్లు బిలువుడిం • పొదవగాను
యింతకన్నను మంచి పే • రెద్ది లేదు॥

కుళిం॥ బ్రాహ్మణోత్తమా మీరు లెస్సగా వర్ణించి నామంబిడినందులకు నే నెంతయు సంతసించితిని. ప్రస్తుతమీ ముత్యాల హారమును బహుమతిగా గొని చనుఁడు. (యిచ్చును.)

అనం॥ (పుచ్చుకొని) ఆ. సెలవు (నిష్క్రమించును).

(తదుపరి కుళిందుఁడు చంద్రహాసునకు పదియారువత్సరముల ప్రాయముఁరాగా, పట్టాభిషిక్తునిజేయును యతడు అనేక రాజులనుగెల్చి హర్షంబున నుండును)

---

# సంగీత చంద్రహాస నాటకము.



## ద్వితీయాంకము.

### ఒకటవరంగము.

### కుళిందుని సౌధము.

(కుళిందుఁడు చంద్రహాసుఁడు ప్రవేశము.)

కుళిం॥ కుమారా! చంద్రహాసా! నీవు నీతిజ్ఞుండవై ప్రజల కష్టములు నీవిగా భావించి, రాజ్యమును చక్కఁగా పరిపాలింపుము. (పరికించి) మరొకమాట.

హిం॥ ముఖారి - యేకతాళం.

1 నా కుమారా వినుమా । నాపలుకును ॥నా॥
నాకు వయసు చెల్లే । నాయన వేగమె
నీకు రాజ్యమూగట్టితీ । నే సంతసించి ॥నా॥
2 ప్రతియేట మనమూ । ప్రభూనకు కప్పము
పదివేలు కట్టావలెనూ । భయభక్తుల ॥నా॥
3 యిదిగాక మంత్రికీ । యిఁకకొంతలంచము
ముదముతొ నిడుచూ మెలగుమా । మూర్ఖూఁడతండు ॥నా॥
4 వాలాయంబుగా । వరకృష్ణరెడ్డిని
పాలనజేయూరామునీ । భక్తి విడకుండు ॥నా॥
ఈ విధముగా ప్రవర్తింపుచుండుము.

చంద్ర॥ జనకా ధీరుఁడనై. అనేక రాజులను జయించి రాజ్యముల గ్రహించిన నేను మీరు బంపునంత కట్నము గాక మన రాజునకు గొప్పగా కట్నమును బంపెదను చూడుము. (అటునిటు జూచి) ఓరీ సేవకా.

సేవ॥ అయ్యా యేమి దేవర సెలవు.

చంద్ర॥ నీవీ బంగరుపళ్లెరమునంగల వివిధ భూషణములను రూప్యములను నా యానతిగా కుంతలరాజు మంత్రియగు దుష్టబుద్ధి కప్పగించిరమ్ము.

సేవ॥ చిత్తము. (అని పళ్లెముగొని పోవును.)

కుంతల నగరము.

(ఆసీనులై కుంతలుఁడు దుష్టబుద్ధి ప్రవేశము.)

కుంత॥ సచివరా మన సామంతరాజుల కప్పములన్నియు వచ్చినవా.

దుష్ట॥ రాజా సమస్తరాజన్యుల కట్నములు చేరినవి కాని, కుళిందుని కానుకలుమాత్రము రాలేదు హేతువేమో తెలియదు. (అనునంతలో)

సేవ॥ అయ్యా మంత్రిపుంగవా మా చంద్రహాస మహీపాలుని యానతివి మీకు గట్టవలసిన సుంకమును వివిధ భూషణములను దెచ్చితి నిదేగొనుడు (పళ్ళెము ముందుబెట్టును.)

దుష్ట॥ (ఆశ్చర్యముతో) యేమీ! మీదొరకు పుత్త్రిలు లేరుగదా? ఈ కుమారుండెట్లు లభించెనో చెప్పుము.

సేవ॥ చెప్పెదను వినుఁడు.

చం॥ సచివర మా నృపుండు యొక • సారి; భటాళితో వేటకేగగా
నచట నికుంజమందుఁబడి • నారవ్రేలునుకోసి నందుచే
త; చకితచిత్తుఁడై పలువి • ధంబుల చింతిలి బాలుఁదెచ్చి చా
కి. చదువుఁజెప్పి పుత్త్రునిగ • కీరితిఁగాంచె జగద్ధితంబుగణ॥

అంతట నతడు యవకర్శి పరాక్రముడై అనేక రాజన్యులఁ గెల్చి మీకు గొప్పగా కట్నమునంపెను.

దుష్ట॥ (తనలో) ఓహో వీడు నాడు తలవరులచేత చంపిరమ్మనిన బాలుఁడై యుండవచ్చును. ఆ పాపులగు తలవరులు వీనిని చంపకనే వ్రేలుగోసికొని వచ్చిరి. (యోచించి) వీని నేదోయొక యుక్తిఁబన్ని చంపించి మునుల పలుకులు ద్రోచి వేసెదను. (ప్రకాశముగా) కుంతలేశ్వరా! కుళిందుని కుమారుఁడు ప్రతి యేట బంపునంత కట్నముగాక యీ వత్సరము విశేషముగా బంపెను. కావున నాతని గౌరవించి వచ్చుట యుత్తమము. సెలవీయుడు, నే బోయివచ్చెదను.

కుంత॥ సరే మంచిది.

దుష్ట॥ సేవకా! రేపటిరోజున చందనావతి పురమునకు వచ్చెదనని కుళింద చంద్రహాసులతోఁజెప్పుము.

సేవ॥ చిత్తము. (అందరు నిష్క్రమింతురు.)

(దుష్టబుద్ధి చందనావతిపురమునకు పోవుట.)

దుష్ట॥ ఆ దుష్టుండగు చంద్రహాసుఁడు మృతినొందకుండుటకుకారణము తలవరుల లోపమే?

బిలహరి - రూపకము.

1 ఎట్టిమోసమాయెనౌర । యేమనందుదైవవిధిక
గట్టిగ నా తలవరులే । చెట్టొనర్చితిరినాకును ॥ఎ॥
2 సంతసంబుతోడనుంటి । సమసెబాలుడంచునేను
యింతమోసమౌనని కల । నేని దలపనైతినిగద ॥ఎ॥
3 సదా వోరుగంటీ క్రి । ష్ణారెడ్డిని బ్రోచెడు యా
యధోక్షజుండతనికి సా । యంబగుటెట్లో జూచెద ॥ఎ॥

ఈ దురాత్ముఁడు చావకుండెను. మునులపలుకులే నిజమౌనాయేమి. (యోచించి) ఆ. అర్థ్లేలయౌను, నే నిప్పుడే పోయి వాని మచ్చమాపి వచ్చెదను.

కుళిందుని సౌధము.

(కుళిందుఁడు చంద్రహాసుఁడు ప్రవేశము.)

కుళిం॥ కుమారా! ఈ దినమున మంత్రిగా రిచటికి వచ్చెదరని సేవకుఁడు జెప్పియుండెను, ఇంకను రాలేదేమి.

చంద్ర॥ జనకా వచ్చువేళయైనది. యెదురుగాబోయి తోడ్తెత్తము రమ్ము (అని పోవుదురు.)

(దుష్టబుద్ధితో కుళిందుడు చంద్రహాసుఁడు ప్రవేశము.)

దుష్ట॥ రాజా మీకెల్లరకు క్షేమమేనా?

కుళిం॥ మీ దయవల్ల సుఖులమయ్యేయుంటిమి.

దుష్ట॥ మంచిది,....మీ కడకు యింతత్వరగా వచ్చుటకు కారణ మేమనఁగా

కం॥ నిన్నపనిపిన ధననిధుల
నన్నిటి మారాజుగాంచి • హర్షించి మదిఁ
మన్నింపను నీకడకును
నన్నంపగ వచ్చినాఁడ, • నరవరతిలకా॥

కుళిం॥ మంత్రిశేఖరా మీరరుదెంచుటచే నా గృహము పావనమైనది.

దుష్ట॥ (యెరుగనట్లు) రాజా! నీకు యీ కుమారుండెట్లు లభించె.

కుళిం॥ గీ॥ సచివరా! వేటకై నేను • సరగనేగ
నచట బడియుండి బాలుఁడు • నార్తుఁడగుచు
నుండగను గాంచి సుతులులే • కుంటచేత
తెచ్చిసాకితి నేవీని • ముచ్చటలర॥

దుష్ట॥ ఆహా! నీపూర్వపుణ్యముచేతనే యిట్టి సుకుమారుండు లభించు ట నాయనా చంద్రహాసా యిటురమ్మ (కపట దువ్వులు దువ్వి తనలో) ఈ దురాత్ముఁడు నిశ్చయముగా నేను చంపింప బడిన వాడే ఇప్పుడేమి చేయుదును (యోచించి) అయ్యో రాజా! నాకు మారుడైన మదనునితో నొక్క రహస్యముఁజెప్ప మరచివచ్చి తిని యెట్లు?

కుళిం॥ అవసరమైనచో లేఖ వ్రాయుడు జవానుని బంపెదను.

దుష్ట॥ రాజా! స్వంతమనిషి వెళ్ళవలసిన కార్యము గాన, చంద్ర హాసుని బంపుము జవంబున రాగలడు.

కుళిం॥ సరే ! వుత్తరముౘ్రాయుడు.
దుష్ట॥ మంచిది (అనివుత్తరముౘ్రాయును)
కుళిం॥ చంద్రహాసా (అని పిలుచును)
చంద్ర॥ యేమి తండ్రీ
కుళిం॥ మంత్రివల్లభుని యుత్తరము మదనున కొసగిరమ్మా.
చంద్ర॥ చిత్తము.
దుష్ట॥ (చెంతకు బిలచి)
గీ॥ నీవు నీలేఖగైకొని • నేర్పుమీఱ
నాసుతుండగు మదనుగ • నంగబోయి
యిచ్చివేగరమ్మా శ్రీరాఘ • వేశ్వరుండు
నిందుకరుణను నినుగాచు • చుండుగాక॥ (వుత్తరమిచ్చును)
చంద్ర॥ (గుఱ్ఱమునెక్కి కొంతదూరమేగి) అబ్బా ! యెంతదవ్వు వచ్చితిని. యింతవరకును కుంతలనగరముగానరాదయ్యెను. యిదిగో యీసమీపమున వుద్యానవనము గనపడు చున్నది. యచ్చటికేగి కొంతసేపు విశ్రమించి పోయెదను. (వనము సమీపించి) ఆహా ! యేమీ ఈవన రామణీయకము. కుసుమ ఫల సమన్వితంబై యలరారు చున్నయది. (గుఱ్ఱముదిగి నీరుద్రావించి కట్టివేసి) యీ వనములోనికి వచ్చుటచే నా యాయాస మంతయు దీరినది. నేను దాహముదీర్చుకుని పరుండి ప్రయాణ బడలిక దీర్చుకొని పోయెదను. [నీరుద్రావి పరుండును]

ఉద్యానము

(విషయ. విమలాంగియను చెలికత్తెప్రవేశము)

విష॥ సతీవిమలాంగీ ! ఆహాయేమి యీావన మహిమ చూడ చూడ నయనానంద కరంబగుచున్నది.

కీర్తన [మోహనమురళీలోల మాదిరి]

1 వనమహిమను గనుగొనుమా । యిదివినుమా యిటుజనుమా
మనకును వర్ణింపగ తరమా॥వ॥

2 నేనీమధ్యన జూడకుంటినీ
గానీ యిట్టుల నగునంచనీ
చానా దలపగబోనూ మదిలోనూ నేవెసనూ యిల
లోనిక జూడగ బోనూ ॥వ॥

3 విరివిగ కొటికెలపూడి పీటినీ
నిరతము నుండెడి కృష్ణరెడ్డి నీ
పరికృపతోడుతనేలూ గుణజాలూ శ్రితాపాలూ దగు
హరిదయ నలరెను మేలూ॥వ॥

మఱియు

మ॥ సకియా యీావనరామణీయకము నెం • చన్ శక్యమేచూడుమా
శుకబర్హాది రవంపు సొంపుపసయుక్ • శోభాయమానంబులౌ
పికబృందంబులు, పుష్పగుచ్ఛములతో • బెంపారు గంధంబుతో
టి కరంబై శతమన్యునందనము ధా • టిన్మీఱి గన్పట్టెడిన్॥

సతీ! యేమీ సంపెంగపూవుల సౌరభ్యము. అవిగో ఆ మాలతీపుష్పముల గోసికొనిరమ్మా. నేనీ సంపెంగ సుమముల గోసికొని ఎచ్చెదను.

విమ॥ చిత్తము అటులనేగోసెదను (యిరువురుపూలుగోయుదురు.)

విష॥ (నిదురించు చంద్రహాసునిఁజూచి) చెలీ! ఇటురమ్మా (చెంతకుఁబిలఁచి) యీ నవమోహనాంగు డెవ్వరో చూడుము.

విమ॥ అమ్మా! యితఁడెవరో, బాటసారివలెనున్నాడు.

విష॥ ఆహా! యేమి వీని కళావిభ్రమము. వీని రూపమెంత జూచినను తనివిదీరకున్నది. చూడజూడ మదనోద్రేక మెక్కుడగుచున్నదే? వీనిని గూడుటెట్లు?

ఉ॥ అంగజుఁబోలు వీని పతి • యంచును కౌఁగిటజేర్చి ముద్దులొ
ల్కంగను కాముకేళినిల • గ్రక్కునదేలని కాంతకట్టి సౌ
ష్టాంగమదేల రూపము, ది • టంబగు చన్గవలేల, మత్త మా
తంగమునైన గేరు నడ • తా, యదియేల వృథాతలంపఁగన్॥

విమ॥ అమ్మా ఆతఁడెవ్వరో వాని యూరును పేరును విచారింపకనే, మోహపరవశురాలవైన నేమిలాభము?

మానినీవృత్తము

అమ్మరొ పూరుషుఁడెవ్వరొనీవును । యాతనివూరును, పేరును, శీ
ఘ్రమ్మునసడ్గక మోహమునన్ మును । గంగప్రయోజనమేమిటికొ
వెమ్మదితోడుత లేపియు ప్రేమతొ । నీమనసిచ్చియు మాటల నా
డిమ్మహినిన్గడుమంచిదెయౌను సు । మీతరియాపనికై చనుమా॥

విష॥ సఖీ? నీమాటనిజమే. లేపిచూతునా (చెంతకుబోయి) ఆలేపుట యుక్తముగాదు (యోచించి)

కీర్తన (మందయానయాలింపుమ, మాదిరి)

1 ఎవరైయుండునో యీ శుభాంగుడూ । యిటుగనుమాచెలియా
నవమన్మథు నిలగేలిసేయునీ । ప్రవిమల తేజంబూ ॥ఎ॥
2 పుట్టినదాదిగ గాంచనైతి నే । నిట్టిరూపవరునీ
గట్టిగ నీతడు నాథుఁడైన నా । కామితములుదీరూ ॥ఎ॥
3 కులమెయ్యదో స్థలమెయ్యేదో నీతిని । గురుమాతృకలెవరో
తెలియదాయె నింకేమి సేయుదును । తేటతెల్లముగనూ ॥ఎ॥
4 అనవరతంబును కృష్ణారెడ్డిని వనరగాఁచునట్టీ
ఘనమునికలాప సన్నుతుఁడౌ, రా । ఘవుని సాక్షిగానూ ॥ఎ॥

చెలీ ! ఎవ్వరోయని సందేహింపనేల. వీని ముఖముఁజూడ, రాకుమారుఁడేనని తోఁచుచున్నది. అయినను వివాహమైనదో లేదో జందెము జూచెద (నని వడకని జందెమును గని) ఆహా! నానోము ఫలించినది. నాకోర్కెలన్నియు దీరినవి. నే నీతని తప్పక బెండ్లి యాడెదను. (జేబులోవుత్తరముఁజూచి) యేమోజేబులో వుత్తరము న్నది. చూచెదను. (ఉత్తరముదీసి చదువును.)

ఉత్తరము

గీ॥ మత్కుమారుఁడెయౌనట్టి • మదనునకును
దీవనలనిచ్చి గురుడంపు • దివ్యలేఖ

యేమన, నితడు నాకు న • హితుఁడు గాన
వీని కాలసింపకనీవు । విషమునిమ్ము॥

ఇట్లు,
భవజ్జనకుఁడు,
దుష్టబుద్ధి.

ఏమిది! ఆశ్చర్యముగానున్నది. ఈ వుత్తరము మా జనకుఁడు వ్రాసినదే. యట్లు వ్రాయుటకు కారణ మేమైయుండును. (అని దిగులుపడి)

మ॥ జనకా నీవగులేఖనుంజదువ లె • స్సఁ నోరురాదాయె నా
కును పాపంబనియెంచకఁ యిటుల నా • క్రోశంబునఁ వ్రాయ నీ
మనసెట్లొప్పెనా నీతఁదేమపకృతి • న్మర్యాద బోనాడి చే
సెనొ తెల్యంగనురాదు యైన నెపముం • జేచేతగావింప ప్రే
మను మేల్గార్చుటమంచిదన్వచనముఁ • మానుంటివేయజ్ఞతఁ

అయ్యో! నా కీతడే భర్తయౌననుకొంటినే, ఇతడు మృతినొందినవెనుక నాకిఁక దిక్కెవ్వరు (యోచించి) అయిన నొక్కయుక్తిఁబన్నెదను. ఈతనికి చావులేకుండునటులను, నాకు భర్త యౌనటులను, యీ వుత్తరమునే దిద్దెదను (అని కనుల కాటుకతో నిట్లు దిద్దును.)

ఉత్తరము.

గీ॥ "మత్కుమారుఁడె యౌనట్టి • మదనునకును
దీవనలనిచ్చి గురుడంపు • దివ్యలేఖ

యేమన నితడు నాకు ను । హితుఁడుగాన
వీని కాలసింపకనీవు । విషయనిమ్మ॥

ఈ వుత్తరమిప్పుడు శుభార్థమునే దెలుపును (అని వుత్తరము జేబులోబెట్టి) సఖీ! యీ పురుషుండు మన సౌధమునకే వచ్చును. కాలాతీతమైనది. అంతి పురమున కరుగుదమురమ్మ. (నిష్క్రమింతురు.)

(చంద్రహాసుఁడు నిద్ర లేచి)

అబ్బా! యెంత నిద్రబోయితిని వేగముగావెళ్ళి వుత్తరము మదనునకిచ్చి ఈరోజు సాయంతనమునకే తప్పక మాపురి కేగెదను (అని పోవును.)

రెండవరంగము.

కుంతలనగరము.

(మదనుఁడు చంద్రహాసుఁడు ప్రవేశము.)

మద॥ అయ్యా! మీరెవరు ?

చంద్ర॥ నేనా రాజకుమారుఁడను, మీపేరేమి !

మద॥ నాపేరు మదనుడందురు తమ గ్రామమేది?

చంద్ర॥ ఓహో! మదనా! సద్గుణ!

తరళ॥ సదననాయది చందనావతి । సత్పురంబు నజస్రము—
సదయనేలు కుళిందుసూనుఁడ । చంద్రహాసుఁడ నీదు తం

ద్రిదిగో నీకొక జాబుబంప మ । రీ రయంబునదెచ్చితీ
ముదముమీరఁగ దీనిఁగైకొను । మోస్మరాకృత వేగమే
(పుత్తరమిచ్చును)

మద॥ (విప్పిచదివి) రాజకుమారా!

పూరి కళ్యాణి - ఆది.

1 భళిభళి నీరాక । కిల ధన్యుఁడానైతి
తలఁప చంద్రహాసా । తంద్రి లేకిటువ్రాసె ॥భ॥
2 ఇతడునాకు హితుం । డీ పురుషునకు నా
సుత విషయసిడి పెండ్లి । తతజేయు మంచాని ॥భ॥
3 ఆలస్యమేలాచెలి । యల నీకొసఁగిపెండ్లి
యీలగ్నమందూనే । నింపుతో జేసేద ॥భ॥
4 యల కృష్ణారెడ్డి । ననయము బ్రోఁచు నా
యిలజాసతి సుప్రా । ణేశునియానా ॥భ॥

చంద్ర॥ సరే! తమ చిత్తమువచ్చినట్లుగానిండు. మీ కడ్డుచెప్పునంత వాడనా!

మద॥ అట్లయిన తమరు కొంచెము విశ్రమింపుడు. నేను వివాహ ప్రయత్నముఁజేయించెదను. (అని పోవును.)

చంద్రహాసుని పెండ్లి.

(మదనుఁడు బ్రాహ్మణులు పురజనులు పరివేశించి ఆసీనులౌదురు.)

బ్రా॥ ఆ. ఆ. లగ్నము సమీపించినది వధూవరులను దోట్కొని రండు. (దాసీలు వధూవరులను పీటలపై కూర్చుండబెట్టుదురు.)

బ్రా॥ శ్లో॥ "తదేవలగ్నం సుదినంతదేవా తారాబలం చం
ద్రబలం తదేవా విద్యాబలం దైవబలం తదేవా
లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి........

శ్లో॥ యత్రయోగీశ్వరః కృష్ణోయత్ర పార్థో
ధనుర్ధరః తత్రశ్రీ ర్విజయో భూతిర్ధ్రు
వా నీతిమతిర్మమ........

శ్లో॥ స్మృతే సకల కళ్యాణభాజనం, యత్రజా
యతే పురుషస్తమజం నిత్యం వ్రజామి
శరణం హరిం.

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాన్నమః ఉమా మహేశ్వరాభ్యా న్నమః వాణీ హిరణ్య గర్భాభ్యాన్నమః సీతారామాభ్యాన్నమః సర్వేభ్యో మహాజనేభ్యోన్నమః.... శ్రీ మహాగణాధిపతయేనమః ధ్యానావాహనాది షోడశోపచార పూజాం సమర్పణంనమః........ తలంబ్రాలబియ్యము వస్త్రములు మంగళసూత్రమును తీసికొని రండు....

మాంగళ్య దేవతాభ్యోన్నమః ధ్యానావాహనాది షోడశోప చార పూజాం సమర్పణంనమః

శ్లో॥ మాంగళ్య తంతునానేన, మమజీవనహేతున
కంఠేబధ్నామి సుభగే సాజీవ శరదాంశతం....

చంద్రహాసా: లేచి మంగళసూత్రమునుగట్టుము (కట్టించును)

శ్లో॥ స్త్రీణాం జలీనాం పురుషాం జలీనాం క్షీరాబ్ధి
కన్యాంజలి ప్రోక్షణీనాం సువర్ణపాత్రస్థిత
పూర్ణతండులైః పరస్పరై ర్వాశిర సై శ్ఛతుర్ధం

చంద్రహాసా, విషయ తలంబ్రాలుబోసికొనుడు (అనిపోయించును) మదనా బ్రహ్మముళ్ళకు దక్షణదెమ్ము.

మద॥ యిదిగో (అని యిచ్చును.)

బ్రా॥ శ్లో॥ అక్షతాని సువర్ణాని హారిద్రైః ఫల సంయు
తం, పథూవరేషు వర్ధంతి బ్రహ్మగంధి
విధీయతే (అని బ్రహ్మముళ్లవేయును.)

ఆ. ఆ. చదివింపులు చదివింపులూ (అని పెద్దగా అరచును.)

మద॥ ఇదిగో పిల్లవానికి చదివింపుడు (అని ద్రవ్యమిచ్చును.)

బ్రా॥ శ్రీయాం వర్ధస్వమాయుష్య మారోగ్యమయుతా శోభమానం మహ్యాతే, ధాన్యం ధనం పశుం బహుపుత్త్రలాభం శత సంవత్సర దీర్ఘమాయుః నీ పాణిగ్రహ మహోత్సవ కాలమందు మీ బావ మదనుఁడాశీర్వదించి పదివేళ్లగు అంగుళ్యాభరణనిమిత్తము వెయ్యిన్నూటపదహారు రూప్యములు (దోసిటిలో బోయును.)

మద॥ ఇదిగోః మా చెల్లెలు విషయకు చదివింపుడు (అని వస్త్రములిచ్చును.)

బ్రా॥ (శ్రీయాం అను పైమంత్రమును జదివి) నీ పాణిగ్రహణ మహోత్సవకాలమందు మీ యన్న మదనుడు ఆశీర్వదించి చది

వించిన బంగారపు చెరుగుల పట్టువస్త్రములు (యిట్లు చదివించి, వధూవరులను లేపి.)

శ్లో॥ కశ్యపాత్రి భరద్వాజా విశ్వామిత్రశ్చ గౌతమః
వశిష్టో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయ స్తథా॥

సప్తర్షి దేవతాభ్యోనః ఇద మర్ఘ్యం సమర్పయామి. (అని అర్ఘ్యమిడిపించి) అదిగో! అదిగో! అరుంధతిని జూడుడు (అని చూపించును, అంతట పెండ్లి ముగియును.)

మూఁడవరంగము.

కేళికా గృహము.

[చంద్రహాసుఁడు ప్రవేశము.]

చంద్ర॥ (గదిలో చిత్రపటములఁగాంచి స్వగతము) ఆహా యేమి! ఈ ఛాయాపటముల శృంగార విశేషములు కనులపండువు గావింపుచు నితాంత సౌభాగ్య లతావితానంబుల కాలవాలంబులై పెంపగు సొంపు సంపాదింపుచున్నవి. (యొకటి చేతదీసికొని) ఇది నామఱదియగు మదనునిది. యెంత ప్రత్యక్షముగా నున్నది [మఱియొకటి దీసిచూచి] ఓహో! నా ముద్దులాడి ఇచ్చట మన్నదే. యేమీ ఈ సౌందర్యము!

(విషయ చిరునవ్వుతో వెనుకకువచ్చి నిలచియుండును.)

చంద్ర॥ సీ॥ భృంగంబు సోకక • రంగుగా గనుపట్టు
పద్మద్వయము దీని • పాణియుగము

డంబైన హరి కిర • ణంబు సోకకయుండు
నక్షత్ర నిచయమీ • నాతిగోళ్ళు
చలనంబు నొందని • శంపాలతోత్కరం
బీ రాజవదన శ • రీర సౌరు
పరిపూర్ణ కాంతిచే • పరిఢవిల్లుచు కంద
నట్టి దర్పణములీ • యబలచెక్కు
ఆ॥ వె॥ లహహ దీనిమోవి • యలరు దేనియబావి
బొమలుమారు బాణ • గముఁ సములు
పున్నెములకు ప్రోక • పుష్పాస్త్రుసతి జోక
గాకయుండె నౌర • కలికిఠీవి॥

కలికీ! నీతోమాటాడ భ్రాంతి గలుఁగుచున్నది. ఒక్కింత ముచ్చటింపుము (అని వెనుకనున్న విషయనుగని, నవ్వుచు) మనోహారీ! నీవిట్లేలవచ్చితివి.

విషయు॥ (నవ్వుచు) నాథా మీరీ చిత్రపటంబుల వర్ణింపుచుండ తిలకింప వచ్చితిని.

చంద్ర॥ మంచిది, ఇందు కూర్చుండుము రమ్ము (ఇరువురు శయ్యపైని కూర్చుండి ముచ్చటించుచుందురు.)



# తృతీయాంకము.



ప్రథమ రంగము,

(దుష్టబుద్ధి తన గ్రామమునకు వచ్చుట.)

దుష్ట॥ (తనలో) చంద్రహాసుఁడు మా పురికేఁగి యిప్పటికి మూడు దినములైనది. మదనునిచేత తప్పక మృతి నొందియుండును (సంతోషముతో) అమ్మా యిప్పటికి నా ప్రాణములు చల్లబడినవి.

రూపకం (దేవీ మీనాక్షిమాదిరి.)

1 చింతనొందనేల నాదు। పంతమెల్ల దీరిపోయె
సుంతలోన మునులవాక్కు। సున్నజేయకుందున భళి
మి॥ కుంతలపట్టణమునకును। కొంతునిగా మదనుజేసి
వంతుకెక్కు నృపతుల వధి। యింతు జంకులేక వెసను ॥చిం॥
2 యెల్లజనులు బొగడనేను। యింపుగ పేరొందెదను
యుల్లమునాలోచనందు। తల్లడింపఁజేతుబుధుల
మి॥ కొల్లగ కృష్ణారెడ్డిని। యుల్లాసమునేలు రాముఁ
డెల్లిదముగ నాకును కీ। డెట్లు గూర్చునో చూచెద ॥చి॥

(కుంతల నగరము సమీపించి) ఏమిది పట్టణమంతయు అలంకరింపబడియున్నది (యోచించి) ఆ. ఆ. తెలసినది.

ఉ॥ శాత్రవు డంతరింప, కడు • సంతసమొందుచు పట్నమంత నా
పుత్త్రిడలంకరించి పరి • పూర్తిగ బందుల కిందుజేయుచుꣳ
మిత్రుల సాటివారలతో • మీరిన స్నేహముతోడనుండు నా
జైత్రుఁడు నంతెకా నితర•చర్య యొనర్పడు బుద్ధి నెంచియుꣳ॥

(అని గృహములోనికి బోవ పాదముల చప్పుడు విని)

చంద్ర॥ (దిగ్గునలేచి) మామగారూ వందనములు.

విషయ॥ (లేచి) తండ్రీ జోహారులు.

దుష్ట॥ (తెల్లబోయి తనలో) వీఁడు చావకపోగా నా కుమార్తెకే మగడైనాడే [ఖిన్నుడై] దీ....ర్ఘా....యు....రస్తు.

చంద్ర॥ మామగారూ లోనికరిగెదము [విషయ చంద్రహాసుడు చనుదురు.]

దుష్ట॥ [పరికంపితుడై] అయ్యో! నేఁజేయు నుపాయ మంతయు. వ్యర్థమయ్యెనే! నేనేమిఁజేయుదును.

గీ॥ త్రాఁచుపాముకు పాలిడి • గాచినట్లు
బెబ్బులికి ఫలలంబిడి • పెంచినట్లు
కొడుకు కూఁతురు దుష్టుని • కొంపజేర్చి
కులమునంతయు పాడ్జేయ • దలఁచినారు॥

వీనినన్న ప్రయోజనమేమి నా కుమార్తెనిడి పెండిలిజేసి న కూర్రిరుండగు మదనుని దండింపవలెను (ప్రకాశముగా) ఓరీ! మదనా.

మద॥ [భయముతో] యేమి జనకా!

దుష్ట॥ [కోపముతో] ఛీ. దుర్మతీ. నేనేమి వ్రాసితిని. నీవేమి జేసితివి?

మద॥ తండ్రీనీయిష్టానుసారామే (జేసితిని. తమకంతకోపమేల?

ఏకతాళం [సోదరనాసీత మాదిరి]

1 నాదుమనవీనివినుమో । నాతండ్రి వేగ
నీదులేఖాజూడూ । నాదుతప్పేమిగలదో ॥నా॥
2 ఉత్తరముదెచ్చినట్టీ । యుత్తమునకూ సుతనిమ్మని
యొత్తివ్రాయాగ నేన । ట్లొనరించినాడ ॥నా॥

అంతియేగాని నాయెడ దోషమెంతమాత్రమునులేదు. ఇదిగో మీరు వ్రాసిన లేఖ జూడుడు (అని యుత్తరమిచ్చును.)

దుష్ట॥ (పుచ్చుకొని చదువును.)

ఉత్తరము.

గీ॥ "మత్కుమారు(డెయౌనట్టి • మదనునకును
దీవనలనిచ్చి గురుడంపు • దివ్యలేఖ
యేమన నితఁడు నాకును • హితుఁడుగాన
వీనికాలసింపకనీవు • విషయనిమ్ము॥

ఇట్లు,
భవజ్జనకుడు,
దుష్టబుద్ధి.

(తొమ్మ దట్టుకొని) అయ్యయ్యో, యెంత పొరఁబడితిని. విషము నిమ్మనుటకు మారుగా విషయనిమ్మని వ్రాసితిని. తనయా! నీయెడనుంతైనను తప్పులేదు. తప్పంతయు నాదే (అని బుజ్జగించి పంపి) ఓరీ చంద్రహాసా! నీవింకను మృతుఁడవు గాకుంటివిగదరా మంచివారలకు చావు తృటిలో వచ్చుచుండును. దుష్టుఁడవైన నీకు రాకున్నది (యోచించి) ఈ పాపి నింతటితో వదలుట మంచిదిగాదు పని నెట్లైన చంపించి, నాదిగులుబాపుకొనియెదను (ప్రకాశముగా) చంద్రహాసా!

చంద్ర॥ యేమి మామగారు

దుష్ట॥ (వినయముగ) నీకు, నాకుమారినిచ్చి పెండ్లిఁజేయుటకేమి యడ్డుగలుఁగునోయని కడు రహస్యముగఁ బెండ్లిఁజేయించితిని నా పుణ్యముకొలఁది నా కల్లుడవైనందుల కెంతయు సంత సించుచుంటిని (పరికించి) రాజకుమారా ఒక్కసంగతి.

గీ॥ పెండ్లి యైదవరోజున • పెండ్లికొడుకు
కాళికాదేవి నర్చించు • క్రమముగలదు
మాయిలువరుస రీతిను • మా సతినిని
మంచి సుమములచేత పూ • జించిరమ్ము.

ఈ సాయంకాలమే యేఁటిగాఁబోయి పూజించిరమ్ము

చంద్ర॥ (తనలో) మామామగారికి నాపై నెంతదయ దయలేనిదే తన కుమారినిప్పించి పెండ్లిజేయించునా! వీరి యంత తెలివిగల వారును, అల్లుండ్లయందు దయగలవారును, జగంబునలేనేలేరు.

(ప్రొద్దువంకజూచి) కాలాతీత మగుచున్నది. నేను సత్వరముగా పుష్పముల గోసికొనిపోయి కాళికాంబ నర్చించి వచ్చెదను.

(నిష్క్రమించును.)

దుష్ట॥ ఓరీ! తలవరులారా!

తల॥ యేందొరో సెలవు!

దుష్ట॥ (తొట్రుపాటుతో) మీరు కత్తులతో వూరి వెలుపలనున్న కాళికాగుడికేఁగి గుడిలోడాఁగియుండి పూజాద్రవ్యముల పళ్ళెరముఁ బట్టుకొని యొక పురుషుండరుదెంచును. యతనిని తక్షణంబు నరికిరండు.

తల॥ చిత్తం చిత్తం (పరుగెత్తుదురు.)

దుష్ట॥ (తనలో) యిప్పటికి నా దేహము కుదుటపడినది. ఈ సారి తప్పక మృతినొందగలఁడు. ఇఁక కుమారుఁడు విధవయగు కుమారిత రాజ్యములగ్రహించి యైశ్వర్యములతో దులఁదూగుచుండ నా కన్నులారజూఁచి సంతసించెదను. (యోచించి) యేమీ! కుంతలరాజుయొద్దకు మంత్రిగా వెళ్ళిన మదనుడింకను రాలేదు. కారణ మరసెదను. (పోవును.) (చంద్రహాసుఁడు పూజాద్రవ్యములఁగొని గుడికిబోవుట.)

హే శాంకరీ జగజ్జననీ కాళీ.

మాండు - యేకతాళం.

1 భయదజన రక్షణీ దేవీ ॥భ॥
2 హేజననీ నీవేదిక్కనినే । నెంచి భజింతునుగా దేవీ ॥భ॥
3 పరమపావనీ పాప విమోచని । ప్రాఁపుఁజేరితినిగా దేవీ ॥భ॥
4 పరమేశునిసతి పాలనజేయుమ । పాహిపాహి వందే దేవీ॥భ॥
5 ఓరుగంటి వర కృష్ణారెడ్డిని । భూరి కరుణనేలూదేవీ ॥భ॥

(అని గుడికి బోవుచుండును.)

[కుంతలరాజు, మదనుడు, మహర్షి, మొదలగువారు ప్రవేశము]

మహర్షి॥ (కుంతలరాజు మోముగని)

గీ॥ నరవరాగ్రణి నీదుమో • మరసిచూడ
మరణ చిహ్నములుగ నాదు • మదికిదోఁచు
చున్నదయ్యా నీదుపనుల • నన్నిటిని, జ
వమున సరిజూచుకొనుము నా • పలుకునిజము॥

కుంత॥ (భయకంపితుఁడై) మునీంద్రా ! యేమీ యిట్టి కర్ణకఠోర ములగుపలుకులు బలుకుచుంటివి. నిజముగా నాయాయుఃపరిమితిని జెప్పుము.

మహర్షి॥ [దివ్యదృష్టినిజూచి] రాజేంద్రా! నీకుకాల మాసన్నమైనది. (సందేహముతో) రే.........పు......... పదిగంటలకుమృతుడవౌనట్లు దోచుచున్నది.

కుంత॥ నిర్విణ్ణుడై అయ్యో! మునీంద్రా! చెట్టుపైని పక్షికైన నాధారమున్నది. కానినాకులేదే యేమిసేయుదును. (ఆలోచించి) యేమీ! రేపే మృతినొందుదునా!

మహర్షి॥ నిశ్చయముగ.

కుంత॥ స్వామీ నేను గతించినవెనుక నాకుమార్తెకు దిక్కులేరామె తమరెరిఁగిన రాకుమారు లెవరైన నున్న జెప్పుము. ఈ క్షణంబాతనిని బిలపించి కుమారినిడి వైవాహికముఁజేసి నారాజ్యమునకు పట్టాభిషిక్తుని జేసి ఆసంతోషమును నా నేత్రోత్సవముగాఁజూచి దివికేగెదను.

మహర్షి॥ రాజా! అట్లయిన వేరే యోచింపనేల. దుష్టబుద్ధి యిల్లుండునగు చంద్రహాసునకు నీకుమారినిడి పరిణయము జేసిన సర్వ సౌఖ్యముల బడయుగలదు. ఈ క్షణమా పనిజేయుము.

కుంత॥ (దిగ్గునలేచి) మదనా మీబావయగు చంద్రహాసుని దోడ్కొని సత్వరముగారమ్ము.

మద॥ చిత్తము అటులనే తోడితెచ్చెదను. అనిపరుగెత్తును

(చంద్రహాసుడు కాళీగుడికి పోవుచుండును.)

మద॥ రొప్పుచు ఓ బావో బావా అనికేకవేయును

చంద్ర॥ (వెనుకజూచి) నన్నెవరో బిలుచు చున్నట్లున్నది.

మద॥ బావో విలువుము. మాట మాట (చెంతకువచ్చి)

సీ॥ కుంతల రాజేంద్రు • చెంతకు నొకముని
యరుగు దెంచియు నిట్టు • లనియెవినుమ
యవనీశ నీకాల • మాసన్న మైయుండె
ననుచుబల్కఁగను • వనటజెంది
ఓ "ఋషీ పుత్రులు • లేరు నాకుసుత చం
పకమాలిగలదు" నా • మెకును ధాత్రి
మీరెరుంగు నృప కు • మారులలో మంచి
వారున్న దెల్పు స • త్వరమున బిల
గీ॥ పించి సుతనిడి బెండిలి • విపులముగను
జేసి రాజ్యాభిషిక్తు ని • జేసెదనన
మౌని నీకె షత్రికనిడ • మంచిదనఁగ
రాజునినుఁగొని రమ్మనె • రయముగాను॥

నీవీతక్షణము రాజుసన్నిధ కరుగుము. నేను కాళికాదేవి న ర్చించివచ్చెదను. పూజాద్రవ్యముల పళ్ళెర మిటుదెమ్ము. (అని తీసికొనును)

చంద్ర॥ మంచిది. తమరు దేవినర్చించి సత్వరముగా రండు. (అని వెళ్లి చంపకమాలనుపెండ్లియాడి, పట్టాభిషిక్తు (డై యుండును.)
మద॥ (పళ్లెరముతో) ఓ కాళికాంబా!
సీ॥ ప్రాలేయ గిరికిని • పరగ బుత్రికవయ్యు
జగములన్నిటియందు • నెగడితీవు

నెగడి శర్వునిబెండ్లి • నింపుమీరఁగనాడి
యర్ధశరీరంబు • నడిగితీవు
నడిగి భక్తులనెల్ల • నాదరంబునగాచి
దుష్టరాక్షసులను • దునిమితీవు
దునిమి జగన్మాత • వనుచు మర్త్యాళిచే
ప్రఖ్యాతినింజాల • బడసితీవు
గీ॥ యట్టి కాళికాంబరొ నీద • యను బడయఁగ
నర్చనముఁజేయవచ్చితి • నమ్మ సతము
నీదుభక్తులనేలె డి • నేర్పుతోడ
కరుణతోడత నన్నేలు • కాళికాంబ॥

ఓ తల్లీ నా పూజగొని కరుణింపుము. నేను సత్వరముగాఁ బోయి నా బావమరది పట్టాభిషేక మహోత్సవమును జూడబోయె దను.

(అని ప్రదక్షిణముదిరిగి గుడిలోనికిబోవ, తలవరులు నరుక హరహరాయని పడిపోవును.)

## రెండవరంగము.

(దుష్టబుద్ధి యొంటరిగాప్రవేశించి.)

ఓరీ! దుర్మతీ! చంద్రహాసా ఇదివరకేదో యుక్తిబన్ని బ్రదికితివి. ఇంకెట్లు బ్రదికెదవో చూచెద. (యోచించి) 'యేమీ! తలవరులింకను రాకుండిరి (చూచుచుండ)

తల॥ ప్రభో దండాలు. ఆ పాపాత్కుణ్ణి నరికి వత్తిమి. యిదుగో కత్తుల రత్తము సూడండి.

దుష్ట॥ భేష్. మీ తెలివికి సంతసించితిని. ఇదిగో యీ పచ్చల పతకము బహుమతిగాఁగొని చనుడు (అని యిచ్చును)

తల॥ సిత్తము (పోవుదురు)

దుష్ట॥ (తనలో) ఓరీ! చంద్రహాస యెన్నిదినములకు మృతుఁడ వైతివిరా. (పరికించి) అయినను గుడికేఁగి వానిశవమును కన్నులారఁజూఁచి వచ్చెదను (గుడికిపోబోవ నంతలో)

(చంద్రహాసుఁడు, చంపకమాలిని వచ్చుట)

చంద్ర॥ కలికీ! నా శ్వశురుడగు దుష్టబుద్ధి యనుగ్రహముననే నా కింతటి వైభవముగల్గుట కావున యాయనకు నమస్కరించి వత్తము రమ్మ.

చంప॥ చిత్తము (యిరువురు దుష్టబుద్ధి కెదురుగావచ్చి)

చంద్ర॥ మామా, జామాత వందనములుగొనుడు.

చంప॥ తండ్రీ, కుమారి జేజేలు బడయుడు.

దుష్ట॥ (నివ్వెఱగంది) శు....భ....మస్తు.

చంద్ర॥ అయ్యా! మదనుని యనుగ్రహమున కుంతలరాజు కుమారి తను బెండ్లియాడి పట్టాభిషిక్తుఁడనై తమరికినమస్కరింపవచ్చితిని.

దుష్ట॥ మదనుని యనుగ్రహ మేమీ!

చంద్ర॥ నా చేతనున్న పూజా ద్రవ్యములుగొని మదనుఁడు కాళీ గుడికి వెళ్లినందునగాదా నేనింతటి పై భవమున నుండుట.

దుష్ట॥ మదనుఁ డెటనుండివచ్చి పూజా ద్రవ్యములుగొని గుడికి చనెను.

చంద్ర॥ కుంతలరాజు చెంతనుండి.

దుష్ట॥ (ఖిన్నుఁడై) మంచిదేః యిఁక లోనికరుగుడు (చంద్రహాసుడు విషయ నిష్క్రమింతురు)

దుష్ట॥ (దుఃఖముతో) ఈ కిరాతకుఁడు చావక నా కుమారునే చంపించినాడే యేమిసేయుదును హా తనయా మదనా (మూర్ఛిల్లి కొంతవడికి లేచి) అయ్యో! ఆ దుష్టుని యొకట రెంట చంప జూచిన చావకున్న అంతట బుద్ధిగలిఁగి మానుకొనక క్రోధముచే, దేహంబు దెలియక నతనిని చంపి పంతము దీర్చుకొనపలె నని తుదకు కొమరునే కోల్పోయితిని? నా వ్యూహాలన్నియు మంటగలసె (యోచించి) ఔను. పెద్దల వాక్యములేల వృథా యౌను.

గీ॥ తానుద్రవ్విన గోతిలో • దానెపడును
చెరుప నొకనిని దలఁచిన • జెడునుతానె
తానొకటి దలపంగను • దైవమొకటి
దలఁచునను సూక్తులన్నియు • తథ్యమాయె॥

అయ్యో! కార్యముఫలించదాయె.నాదుఃఖమునకు నేనేమనిచింతింతును.లోకమున జనులేకార్యమైననుజేయనెంచననదివిఫలమైనవారి దుఃఖమిట్టిదియేగదా! (కొంతయోచించి ధైర్యముపహించి)మనసు దైన దెరిగియుండియు తలవరులేలనరుకుదురు. యదిఅంతయు కల్లగాఁదోచుచున్నది. అయినను గుడికిబోయి చూచెదను. (గుడికిబోయి పడియున్న మదను శవముంగాంచి) హా! మదనా! నీకెట్టి దురవస్థ గలిఁగెనురా తండ్రీ (అని పెద్ద పెట్టున యేడ్చుచు)

ముఖారి- యేకతాళం

1 ఓకుమారకా హా । నాకు దిక్కెవరయా
నీకు నాకూ పాపవిధి । గాక జేసెరా॥ ఓ॥
2 ఇచ్చటికినీ వెంచూ । కొచ్చినాడవో
సచ్చరిత్రా పాడుభటులూ । చంపివైచిరా॥ ఓ॥
3 యెన్నొనోములూ నీకై । యెన్నొవ్రతములూ
అన్నిజేసినా ఫలమూచేత । నిన్నె గంటిమీ॥ ఓ॥
4 తుట్టతుదకునా నోటా । మట్టిగొట్టియూ
నిట్టిమాయామౌడూవనుచు । నేయెరుంగరా॥ ఓ॥
5 భూరి కొటికెలాపూడీ । పురమునలరెడూ
ధీరుఁడు క్రిష్ణరెడ్డినేలుఁ దై । త్యారీ యిటుజేసే॥ ఓ॥
తండ్రీ మదనా.

గీ॥ కన్నతండ్రి నీవుండిన । న్మన్నుజేతు
వనుచు నెంచిన నన్నార్తి • యందుముంచి

యేగుదెంచితివిర, దివి • కేనుగూడ
నింపుతోడను వత్తు ని • దేకుమార

అయ్యోతండ్రీ! నన్నేమి జేసిపోయితివి. నీకై యెన్నో రాజ్యములను యెంతోద్రవ్యమును యెన్నో వెలలేని భూషణముల నార్జించితిని. అవియన్నియు నేమిజేయమనియెదవు. నన్నునీవుబాసిననునిన్ను నేనుబాసిక్షణమైనను మనుదునే.

హిం॥ ముఖారి, ఏకతాళం.

1 ఎటుల బాసీయుందురా • యిఁకనిన్నూతనయ
యిటులౌనంచనీ • యెంచగ లేనైతి
నెటులా భరించీయుందురా • యీ ప్రాణముల॥ ఎ॥
2 హంసతూలికతల్పా • మందు శయనించునీవు
హింసనీ గుడిలోబడితివా • హే కన్నాతండ్రీ॥ ఎ॥
3 నాయాసలన్నియూ • నట్టేటగలపియు
నాయన దివికీజేరా • న్యాయంబెనీకూ॥ ఎ॥
4 ప్రేమతో నోరూగంటీ • క్రిష్ణారెడ్డినేలు
కామునీ జనకూడిట్టీ • కార్యామొనగూర్చె॥ ఎ॥

అయ్యో దుఃఖ మాపుకొందమన్నను ఆగకున్నది (కాళినుద్దేశించి) ఓసీ కాళీ నీ సత్యముగ్గాలిపోయినదా నాసుఁతుడు చావగా చూచుచుంటివా ఛీ నీముఖము జూడరాదు (పుత్త్రినిగని) తనయా నాకు యేమిదిక్కు జూపిపోయితివి (నిశ్చలుఁడై దేవు నుద్దేశించి)

ఓ జగదీశ్వరా నీకుదక్క నాకిక దిక్కులేరు నాడుమునులతోనీవు లేనేలేవని యెుదలుదెలియక దూషించి కడకువ్యర్థుడనైతిని యిప్పటికి జ్ఞానముగలిగినది నా దుష్కృతుల మదినెంచక యీ యపరాధిని క్షమింపుము. (పుత్త్రినిగని తెంపుతో) హా! తనయా నీవు గతించినవెనుక నాకీ వైభవములేల, నాబ్రతుకేల ,నేనేల ఇదిగో యీ కాశికాశిలకు తలమోదికొని, నీచెంతకు వచ్చెదను హా కుమారా, హా కుమారా, (అని తలమోదికొని చచ్చును)

-

## మూడవరంగము

(చంద్రహాసుఁడు కాళీగుడికిబోవుట)

(విషాదముతో) కాళికోపవాసకులు మామయు మరదియు కాళికాలయమున మృతులై తిరని చెప్పియుండిరి. అయ్యో! యెంత కర్ణకఠోరమగు వార్త వినవలసివచ్చెను.

ఉ॥ నాదగుమామయున్మరఁదు • లక్కటకాళికదేవళంబునన్
వేదనచేత ద్రెళ్లిరట • వేగిరమే నటకేగుదెంచి నా
మోదముతోడ కాళికను • ముందుభజించి సజీవులివ్వుత
ల్లీదయ యంచు నిత్తరిని • లేపెదవారల శ్రద్ధఁబూనియుణ్

(గుడికిబోయి పడియున్న మామ మర్దులగాంచి)

(దుఃఖముతో) అయ్యో మామా నీకును ముద్దులమరదికిని యెట్టి దుర్మరణము తటస్థించెను. (మామపైనిబడి) హా మామా!

కీర్తన (హానకుమారా, మాదిరి)

1 ఈమహిని నేనిన్నూబాసి • యెటులనూ బ్రతుకంగాగలను
జామాతానౌనన్నూ వదలీ • జనఁగనీకున్యాయమౌనె॥ ఈ॥
2 ఒకజాబూమూలా మూననే • యొనర పెండిలిజేయించియు
సకలవైభావములాచేతా • సంతసింపాజేసినట్టి॥ ఈ॥
3 భద్రకాళి పూజాజేయా • బంపియూ కుంతలరాజ్యంబు
భద్రముగమా నన్నూ సత్వరి • పాలనాకర్తాగజేసిన॥ ఈ॥

4 అన్నిప్రేమాలూనువిడచి • నన్నుయాత్రిపాలూజేసి
క్రన్ననా దివికేగేలీవీ • గా, యికనూనాకండాయెవరు॥ ఈ॥
(దేవునుద్దేశించి) ఓదేవా దివ్యప్రభావా!
5 కూర్మితోడా కృష్ణారెడ్డిని • గొబ్బునాగాచూచునుండు
ధర్మచేలా నాటాదుఃఖా • ప్రాప్తినీ గల్పించీతీవ ॥ రః॥

(మదనునిపై బడి) హా మదనా నాస్నేహము పీడి పోయితి వా నాకు తెరవెపరిని(జూపిపోయితివి. (యోచించి) యింకనాకు ది క్కెవరు గలరు. అన్నిటికిని మహాజనయిత్రియగు భవానియేదిక్కు (అని హోమగుండమున తన శరీరమును గోసి పేల్చి యాహుతు లిచ్చుచు.)

కీర్తన (ననుగన్నతల్లి మాదిరి)

1 భాసితశ్రీకాళి । పరమాపవిత్రీ
దోసిలొగ్గినాని । దోవిమలగాత్రీ ॥భా॥
2 జాగేలజేసేదు । సజ్ఞాన వినుతా
వేగవీరలగావ । వే నాదుమాతా ॥భా॥

(నిశ్చలు(డై) ఓకాళికాంబా నేనే క్షత్రియ వంశజుడ నైతి నేని నేనే భూతదయా న్వితు(డనైతినేని నేనే చంద్రహాస సార్థకనా ము(డ నైతినేని కరుణించి నాయుద్యమము నెరవేర్పుము. లేదేని నేనును వీరితోబాటు తలమోదికొని మృతినొందెదను. (అనిలేచును)

కాళి॥ (ప్రసన్నమై) ఓచంద్రహాసా ఆఁగుమాఁగుము. నీభక్తికి మెచ్చితిని. నీకుశుభముగలుగుగాక. నీ శ్వశురుఁడును మరదియును పునర్జీవు లగుదురుగాక. యికనేను పోయెదను. (అనిఅంతర్హిత యౌను.)

(దుష్టబుద్ధి మదనుడు నిద్రలేచినరీతిని లేతురు)

చంద్ర॥ మామా నమస్కారము (నమస్కరింప)

దుష్ట॥ (చంద్రహాసుఁడు బ్రతికించెనని యెఱింగి సంతోషముతో కౌగిలించి)

సీ॥ అల్లుడానీదు మ • హాత్మ్యంబు నెరుఁగక
భటులను నరుకగా • బంపినాడ
లేఖలోమదనుకు • లేశంబు సంశయిం
పక విషంబిడు మని • వ్రాసినాడ
కాళిపూజలుజేయ • గా నిన్నుబంపి వె
సఁ సుతుగోల్పోయి • చచ్చినాడ
యెన్నోయుక్తులు బన్ని • నిన్ను జంపగఁజూచి
కడకువ్యర్థుండనై • గ్రాలినాడ

గీ॥ నిట్టి కులపాంస నుండును • నిట్టిమూష
కుఁడను దుర్మదాంధుఁడ ఘాత • కుఁడ కుటిలుఁడ
మందభాగ్యుడ నౌనన్ను • మామయన్న
నీదుమర్యాద జెడునయ్య • నిక్కముగను॥

నిన్ను అనేకరీతుల (జెరుపనెంచితిని. వాటిని మదినుంచకుము. (పరికించి) వాటికేమిగాని నాకిపుడొక కోర్కెగలదు. దానిం దీర్పుము.

చంద్ర॥ అదియేది సెలవిండు.

దుష్ట॥ ఈరాజ్యమునకును చందనావతి పురి రాజ్యమునకును నిన్ను పునఃపట్టాభిషిక్తునిఁజేసి నాకొమరుఁడగు మదనుసినీకు మంత్రి గానియమించి యీ వినోదమును నేత్రోత్సవంబుగాఁ జూడ నుంటిని. నా యాజ్ఞనెరవేర్పుము,

చంద్ర॥ సరే! తమచిత్తమునకు పాత్రుడను.

దుష్ట॥ అట్లయిన గృహంబునకు బోవుదమురండు (పోవుదురు)

పట్టాభిషేకము.

(దుష్టబుద్ధి, చంద్రహాసుఁడు, మదనుడు, విషయ, చంపకమాలిని, ప్రజలు మొదలగువారు ప్రవేశము)

చంద్ర॥ (లేచి) ఓసభికులారా! మీకష్టములు నావిగా భావించువాడను మఱియు,

సీ॥ ధర్మంబునాల్గుపా • దంబుల నడువగా
వించి యీపుడమిపా • లించువాడ
సొరిది మానవులందు • సుఖదుఃఖములనెల్ల
నావిగాభావించి • నడచువాడ

దుష్టవర్తనుల బం • ధురగతిం దండించి
శిష్ట సంరక్షణ • జేయువాడ
ప్రజలను నిర్బంధ • పరచి యించుకయైన
దండుగల్ గైకొన • కుండవాడ
గీ॥ నెల్లవారల సమదృష్టి • నేలువాడ
పట్టభద్రుండనై న్యాయ • పథమనంగ
నొప్పుసింహాసనంబెక్కు • చున్నవాడ
నన్ను సోదరునిగ జూడు • డన్నలార॥

[అని సింహాసనమెక్కి కూర్చుండును]

దుష్ట॥ [లేచి] పుష్పమాల చంద్రహాసుని మెడనువేసి దీర్ఘాయురస్తు పుత్రపౌత్రాభివృద్ధిరస్తు [అని దీవించును]
ప్రజలు॥ (లేచి) ఓ చంద్రహాస మహీపాలా! నీకు శుభముగలుగును గాక [అక్షతలు చల్లుదురు, అంతట]

తెరబడును.

మంగళహారతి [ఏకతాళం]

1 హారతిగైకొను । శ్రీరఘురామా॥
కారుణ్యాలయా । కవిజనగేయా॥ హా॥
2 సౌరభమూగల । పారిజాతములు
పారసములునూ । సంపంగిపూవుల ॥హా॥

3 మల్లెపూవులూ । మరువము దవనము
మొల్లలు చామంతీ । మోదమౌ జాజిపూల॥ హా॥

4 గంధము యత్తరు । కస్తూరి సాంబ్రాణి
యింధన సహితమూ । యిడునట్టి కర్పూర॥ హా॥

5 క్ష్మాతలమునను నో । ర్గంటి కృష్ణారెడ్డి
నాతత బ్రోచెడూ । యచ్యుత శ్రీజయ॥ హా॥

## మంగళహారతి.

1 మంగళాహారాతి గైకొను । మావరా శ్రీరామచంద్రా
యింగితమౌ నీలాదేహ । హే పరాత్పరా శ్రితగేహ ॥మం॥

2 సకల మానావాళీ చేతా । సంస్తుతీగొను దేవాదేవా
యకుటిలామౌ భద్రాద్రీశా । యాపదోద్ధారాక వేఁయ। మం॥

3 యిలను కొటికలపూడీ పురిని । నెలకొనీ శ్రీక్రిష్ణారెడ్డిని
విలశితంబుగ బ్రోచు దివిజా । యెలమి మేమర్పించుశుభ॥ మం॥

## గద్యా

ఇది మక్కెనవారిపాలెపు ఆంజనేయ కరుణాకటాక్ష
లబ్ధ కవితా విచిత్ర భారద్వాజస గోత్ర వేంకమ
రాజపుత్త్రి హనుమరాజ సోదర రామరాట్కవి
విరచితంబైన చంద్రహాస నాటకము
సర్వము సంపూర్ణము.

